# వ న కు మా రి

దువ్వూరు రామిరెడ్డిచే
రచింపఁబడి,

1918 సంవత్సరపు టాంధ్రకావ్యపరీక్షలో
శ్రీ విజయనగరసంస్థానముచే సమ్మానముఁబడసి,
తత్ప్రేరణమున ముద్రింపఁబడిన
తెలుఁగుకావ్యము.

---

చె న్న పు రి:
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.
1920

# వ న కు మా రి

## ప్రథమ మంజరి.

చ. అటమటలాడి పల్లవము లాతపసంహతి నాఁడువేళఁ బై
తటమున గొట్టెల న్వాడిచి దాహముతో సెలయేటినీర ము
త్కటముగఁ ద్రావి, తెమ్మెరలతాకుననుయ్యెలలూఁగుపూఁబొదం
గుటిలశిరోజ యోర్తు కనుకూర్కు జనింప శయించెఁజల్లగన్; 1

చ. తరణి మయూఖమాలికలు తాండవమాడుచుఁబూవుటోవరిం
బారి సొరఁబాఱుచు న్నిదురవోవు లతాంగి కపోలపాళి ము
ప్పిరిగొని జాఱు ఘర్మజలబిందువులం బ్రసరించి జాళువా
తరళపునిగ్గులం జిలికెఁ దల్లతికాలయ మెల్ల శోభిలన్; 2

క. పవమానచలితవల్లీ
నివహము సుమరజము రాల్ప, నెలఁతుక కాంతి
ల్లై వసంత వనేందిర క్రొం
జివురాకుల సెజ్జఁ దూఁగు చెలువు వహింపన్. 3

ఉ. ఆతపతాప మించుక నయంబగుడుం గనువిచ్చి పుష్పసం
ఘాతపరాగ సమ్మిళితఘర్మకణావళిఁ బయ్యెదన్ సరో
జాతనేత్ర యొత్తి యలికాంచల సక్త వికీర్ణకుంతల
వ్రాతము కన్నులందొరఁగఁ బైకెగఁద్రోయుచు లేచి, యంగదన్;

క. గిరిసానుతలమునం ద
 త్తటిఁ దేనియ తెట్టెఁ గాంచి, తా నొక కోలన్
 గుఱివెట్టి నొక్క మధురస
 మురలఁగ ననఁటాకు దొప్ప నొడిచి యపేక్షన్. 5

తే. ఆసవం బాని సస్యఫలాళి మెసవి
 ప్రొద్దుచాయలఁ దిలకించి పొలఁతి యున్న
 గొఱ్ఱెమంద మరల్పంగఁ గోరి చనియె
 వేణుగానంబు సేయుచు విపినసీమ. 6

ఉ. అంతకుమున్నె గొఱ్ఱెలు తృణాగ్రములన్ గ్రసియించుచుండియా
 పొంతల నున్న తెల్లుపొద భోరున బెబ్బులియార్వ భీతిమై
 నెంతయు లోయలం జెదరి యెయ్యెడ కేఁగెనొ జాడలేదు త
 త్ప్రాంతశిలోచ్చయంబుల ఖురాంకము లేర్పడు వీలులేమిచేన్.

చ. లలితరసార్ద్రవేణురవలాలిత లైన కురంగకాంత లు
 జ్జ్వలకిసలంబుల న్మెసవ సాఁగక వీనులు నిక్కవెట్టి క
 న్నులఁ బ్రణయావలోకములు నూల్కొనఁగం బరికించియల్లనం
 గలికిచరించుమార్గమును గాంచుచునుండె విముగ్ధచిత్తలై; 8

క. మును దా మందను వదలిన
 ఘన మగునెత్తంబుఁ జేరి కలయం బొడగాం
 చిన నొక్క గొఱ్ఱె యేనియు
 గనుపట్టకయున్న నబల కాతరమతియై. 9

చ. కొలఁకులఁ గోనలన్ గుహలఁ గ్రూరమృగాకులకాననంబులం
 బొలఁతుక చూచి చూచి యెటుపోయినవో బడి గాంచలేక, బె

గ్గిలి నయనాంచలాశ్రువులు గీఁటుచు నేమియుఁ దోఁపకచ్చటం
గల వెలితాలపేటుపయిఁ గంపిత యై మొయిమోపి యిట్లనున్.

ఉ. ఎచ్చటి కేఁగనో తెలియ దియ్యెడ గొఱ్ఱెలమంద యింక నే
నెచ్చటఁ జూతుఁ జూడఁగల వెల్లను జూచితిఁ గంటకాళ్యముల్
పచ్చిక నుండఁ గానకయ పాదము వెట్టిన గాయ మాయె నై
హెచ్చె గతి ప్రయాస, మిఁక నేఁగతిఁబోఁగలదాన నింటికిన్. 11

చ. జనకుఁడు నాదురాక కయి సాంధ్యరుచు ల్విలసిల్లినంతఁ ద్రో
వను దిలకించుచుండును గృపామయ బాష్పజలార్ద్రదృష్టులన్
మనమునఁజింతనొందఁడొ కొమందలు లోయలువట్టిపోయెనం
చని వచియించినంత; నెటులాయన మోము గనంగఁజాలుదున్.

చ. లలితపుసంజ కెంజిగివిలాసము లెల్ల శమింపఁ జీఁకటుల్
బలసి క్రమక్రమంబుగ నిలం గబళించెడిరీతి సౌఖ్యముల్
దొలఁగెడువేళఁ గష్టములు దోఁచుఁ దమంతన వృద్ధియై మనో
విలసన మింకఁగం; బ్రకృతివేడ్కలకున్ గుఱిగా రెమానవుల్. 13

చ. నవకపుఁ బుష్పపత్రముల నాట్యములాడు హిమాంబుబిందులన్
నవసరసీరుహోత్పలకు నందనలక్ష్మి సమర్చ సేయు ప్రొ
ద్దువొడుపువేళల న్మురళి తీఁ డయి పీనుల విందు సేయ మం
దవముల మేపుచుంటిని ముదం బలర స్వలి మంచుపచ్చికన్.

తే. ఇంక నేవ్యాజమునవచ్చి యీ ప్రదేశ
ములను దర్శింతుఁ, జెల్లెఁ బో మోహనంబు
లైన ప్రకృతివిచిత్రంబు లరయుకోర్కె
కాల మెవ్విధిఁ గడదాఁకఁ గడపికొందు. 15

సీ. చటులానిలము వీచి పెటపెట తరుశాఖ
  లుర్విపై విఱిగి యొండొండు జాఱ
నీడజంబులు గట్టు నీడముల్ చిందఱ
  వందతై పోవంగ, బక్షిశాబ
కములు గాయములొంది "కావు కావ"ని కూయఁ
  గరుణామై వృక్షకోటరములందుఁ
జివురుటాకులు పేర్చి చిన్నికూనలఁ జేర్చి
  కాచుచుంటివి గదా గహనసీమ!

తే. నట్టియానంద మింక నా కెట్టు లబ్బుఁ
గలలనైనను గొండలఁ గాననములఁ
బూవుఁ బొదరిండ్ల సెలయేండ్లఁ బుష్కరిణులఁ
దలఁగు సమయంబుఁ దలఁపనే తలఁప నైతి. 16

సీ. కొండనెత్తములఁ గోనాడుమబ్బుల
  గమనసౌందర్యంబుఁ గాంచికాంచి
మేఘోదయంబున మినమిన పురివిచ్చి
  యాడు నెమ్మలయొప్పు లరసి యరసి;
యమృతధారలరీతి నచ్ఛమై ప్రవహించు
  సెలయేళ్లలోఁ గ్రీడ సలిపిసలిపి;
ప్రకృతి మంజులమైన పక్షులగానంబుఁ
  దమిదీఱ వీనులఁ ద్రావి త్రావి;

తే. యెండవేళలఁ బూఁ బొదరిండ్లఁ దూఱి
హరిణగర్భిణులకుఁ జివురాకు లొసఁగి

ప్రసవమాలల ధరియించి ప్రతిదినంబుఁ
గాననంబుల రాణి నై క్రాలు చుంటి. 17

చ. పలుకుచు నిట్టు లావికచపంకజలోచన తారకాద్వయీ
చలనవిహీన మై కనుల జాఱెడు నశ్రులఁ దానమాడుచూ
పులను నభోంతరాళమునఁ బూర్ణపునైక్యము సల్పి భావని
శ్చలతవహించి యుండఁ, గడసంజవిలాసము లంకురింపఁగన్.

ఉ. తైల మడంగ దీపము నితాంతవికాసముఁ జిక్కి గుప్పునన్
జ్వాలగమండి యాఱుగతి, సారమయూఖసంతతుల్ నశింప శో
భాలసతన్ దినాంతమున నంబుజమిత్రుఁడు శోణదీధితిం
జాల వెలింగి పశ్చిమదిశన్ డిగఁ వ్రాలెను గొండచాటునన్;

చ. సమయపుఁదూలికం బ్రకృతి సాంధ్యసువర్ణముఁగూర్చియభ్రి
పత్రమున నలాహకాన్వృతధరాధరశృంగములన్ నికుంజపుం
జములను శాద్వలంబుల విశంకటనిర్ఝరులన్ ఖగంబులన్
రసుదొలఁకన్ లిఖించెనన రాజిలు నయ్యపరాశ యయ్యెడన్.

ఉ. నాటకదర్శనాంతరమునం బ్రతిసీర ఘటిల్లి రంగమున్
మాటొనరీతి దిక్కుహారమండలి వ్రేలు తమంబు నల్లడం
బాటిలి దృశ్యలోకసుషమం దనకుక్షి మఱుంగువెట్టి యొ
ప్పాటను నద్వితీయ మయి భాసిలె మాయకుఁ దోడఁబుట్టువై

తే. సకలజీవులకును వేడ్క సలుపుకొఱకు
నవని డోలికఁ జదలుచందమునకు యామి
నీరమణిగట్టు రసగుండ్ల బారు లనఁగఁ
దారకావళి యుదయించెఁ దరళకాంతి. 22

చ. కిలకిల కావు కావు కిలకీచని పక్షులు నీడసీమలన్
జిలిబిలి కమ్మగానములు సేయుచు నుండె; విశీర్ణపర్ణసం
కలితమృదూర్వపై హరిణకాంత శయించె; గుహాళిఁ బాసి లో
యల హరిపుండరీకనిచయంబులు సొచ్చె మృగామిషాప్తికిన్.

తే. విరహిణీప్రాణసామగ్రి మరుఁడు వేగ
వేదనాద్వీపమును జేర్చు వేడ్కఁ గొఱకు
నీలగగనాబ్ధి జలదకల్లోలములను
బాల శశి యానపోతంబు పరిఢవిల్లె. 24

సీ. వాతేరితంబైన వంశకుంజము రేఁపు
రాపిల్ల కల్లనురవళి దప్ప ;
నరగూర్కునిదురించు చాక చలించిన
నులికి యార్చెడి పక్షియులివు దప్పఁ;
దొనికి బండల జాఱు తుంపరముత్యాలు
నెదచల్లు సెలయేటిరొదలు దప్పఁ,
బగలెల్ల గుహలలోఁ బడియుండి రాతిరి
యెఱకేఁగు నొకిపులుల యెలువు దప్ప

తే. శాంతనిశ్శబ్దతాలక్ష్మి సంతసమున
గిరి వనాంతరసామ్రాజ్యభరము సూచి
సకలజీవసుఖస్ఫూర్తి సలుపు చుండెఁ
జీమ చిటుకని యన్నను శిశుగలదు. 25

తే. సంజకెంజాయ లుడుగుట, సంతమసము
లలమికొనుటయుఁ, బక్షుల కలకలములు.

శీత లానిలసంస్పర్శ, శిశిరకరుని
రాకపోకలునెఱుఁగ దా రమణి యపుడు. 26

తే. భావనారూఢమిథ్యాప్రపంచమందు
సంచరించుచునుండె నా చాన మనము
కాయ మాద్యంతమును జీవకాంతి దొఱఁగి
వాసి యుండె బాహ్యేంద్రియస్పందనములను. 27

తే. ఐందవోపలవిగ్రహంబా యనంగ
సకియనిశ్చేష్ట యై యున్న సమయమందు
నభ్ర మందంపుఁ జుక్కల నలమికొనుచు
నాకసంబునఁ జరియించె నసితకాంతి. 28

చ. అరరె! యిదేమిచిత్రము వియత్తలమంతయు నీలనీరదా
కరమయి తారకానికరకాంతులనైతముఁ గోలుపోయి శ
ర్వరిని మఱింత సాధ్వసకరంబుగఁ జేసెఁ; బృషన్నికాయముల్
తెఱచుగ రాలుచుండెను గులాయములన్ ఖగముల్వణంకఁగన్.

క. కన్నులకు విద్యుల్లత
క్రన్నన మిఱుమిట్లుగొల్పఁ గంపితయయి యా
కన్నియ దిగ్భ్రాంతిని దా
నున్నవిధం బేమి యనుచు నుమ్మలికమునన్. 30

చ. అటునిటు పాఱఁజూచి జలదావృతయామినిగా నెఱింగి య
క్కట! తిమిరంబు నల్గడలఁ గాఱుకొనెం, గనుగానరాదు, మి
క్కుటముగ వానజల్లుబికెఁ, గంపిలెఁ గాయము చల్లగాలికిం
బటముల నీరు జొబ్బిలె, నుపాయము సాయముగానని త్తఱిన్.

తే. ఎంతనిశియయ్యె నయ్యయో! చింత జిక్కి
యెఱుఁగ సంధ్య యడంగుట, నిరులు గ్రమ్మ;
నెటులఁ బోఁగల నొంటిగ నీ భయాన
కమ్ము లగు కొండలోయలఁ గాననముల. 32

మ. నను జింతించుచుఁ దండ్రి యేమనునొ యేనాఁడైన నే నొంటిఁగా
ననమధ్యంబులనుంటి నే నిశల, నీనాఁ డేమొ దుర్బుద్ధి గేఁ
చినయట్లాయె; మృగంబు లేవయిన నం జెండాడెనో యంచుఁ బా
యనిశోకమ్మునఁ గుందునో, కనలునో యత్యంత మీచేఁతకుఁ.

క. నను నన్వేషించుచు వనిఁ
జనుదెంచి తమోనిరుద్ధచక్షుం డయి బా
టను దప్పి జనకుఁ డేగతి
ఘనకాంతారములఁ జొచ్చి గాసిల్లెడినో! 34

చ. తనయనుగా జనించి యిటు తండ్రి నిగష్టము పాలు సేయఁ బూ
నిన ననువంటి దంట లవనింగల రే యెవరైనఁ; బిన్ననాఁ
టనె జనయిత్రి పోయిన దిటంబగు కూర్మి కొఱంతలేక సా
కెను బడరాని పాటులకుఁ గేవలమూఁ గుఱియయ్యె నయ్యయో!

తే. మంజులారామవీథులు మనము నెంతొ
సంతసంబునఁ దేలింపఁ జాలియును ని
రంతశోకార్తుఁ డౌ తండ్రిస్వాంతమందు
నిస్తులాహ్లాదరసమును నింపలేను. 36

ఉ. జ్ఞానసమాశ్రయం బగు విశాలలలాటమునన్ మనోవ్యథా
నూనహాల ప్రకర్షమున నొప్పె వళుల్; పొరలెక్కికన్ను లీ

ఘానిశితత్వముం దొఱంగెఁ జంచలభావము నొందె నాత్మ;తం
త్రీ, నెలవయ్యె నీతనువు తెక్కుడొలంగిన యంగపాళికిన్; 37

ఉ. అట్టి నినుం వయఃపరిణతాంచితకుంతలు సాకుచిత్తునిన్
దిట్టతనానఁగష్టములఁ దించితి, ముంచితి దుఃఖవార్ధి, నా
యట్టి యదృష్టహీనతనయం గనుతండ్రికి శోకభారసం
ఘట్టనగల్గు టబ్బురమె; కష్టము లొంటిగవచ్చునే యెటన్; 38

చ. అని జనకున్ స్మరింద లఁచి యారటఁ గూరుచు నీరజాక్షి దృ
ష్టిని బ్రసరింపనీయక కడింది గలంచెడుబాష్పపూరముల్
గనుగొనలం దొరంగి చిఱుకాల్వలుగట్టఁ గుటీరసీమకుం
జనఁ దమకించునంత నొకచాయను లవ్వని కూఁత రేఁగినన్;39

చ. విని యదియేమటంచు నతివిస్మిత యై లలితాంగి యంతఁ ద
ద్వనికటప్రదేశములఁ బాఱగఁ జూచి చలత్తటిల్లతా
జనితకళాసహాయమున సానుతలంబున మేయుగొఱ్ఱెలన్
గనె శునకంబు మందచెడఁగా నెడ మీాయక వెన్నడింపఁగన్.

ఉ. పెన్నిధిఁగాంచినట్టి నిఱుపేదవిధంబున సంతసించి యా
కన్నియ మందఁ జేరి తమకమ్మునఁ గాపరికుక్క నెత్తి పై
కొన్నదయన్ శిరఃస్థలము గోళుల దువ్వుచు నుచ్చుగొట్టుచున్
మిన్నక ముద్దువెట్టెను దమిన్ శునకంబు గదల్పఁ బుచ్ఛమున్;

క. అటపయి గొఱ్ఱెలఁ గనుఁగొని
కటకట! సగమాయె మంద; గాంఢాంధమునం

దెటు చెట్టుపుట్ట కొకటయి
తటములఁ గ్రుమ్మరునొ ఘులులు తత్తఱ వెట్టఁగ; 42

తే. ప్రాచి వెలివాఱ నిద్దురలేచి, కొండ
దండ నడయాఁడు శటిపిలే యెండలఁ జలిఁ
గ్రాఁగుచుం బోయి వెదకెడఁ గాననముల
మందఁ జెదరినగొఱియల కందువలను ; 43

మ. అని చింతించుచు నంధకారబల నుత్యంతంబు శంపాలతా
జనితాశాంతవిభావిరామమున హెచ్చం గొంతసే పాఁగి, త
ద్వనవల్లీవిచలత్పలాశ నిపతద్వర్షాంబుబిందూత్కరం
బనయంబుం బయిరాలఁ గంటకిత మైయంగంబు కంపిల్లఁగన్;

ఉ. జాఱునటంచుఁ బాదములు సానుతలంబుల మెల్ల మెల్లగం
జేరుచుఁ, జేతికఱ్ఱ నెడసేయక తట్టును బుర్వ పుట్ట లా
దారుల నుండు నంచు; సతతంబును జల్లనిగాలివీన మై
జాఱును గప్పు నప్పాలఁతి శైత్యచలన్ మృదులాధరోష్ఠయై;

క. అడుగడుగున కొకయాపద
జడియక తప్పించుకొనుచు శాతోదరి పెం
జడి నుబ్బి పాఱువాఁగులఁ
గడచుచు మలదాఁటి వెదురుగమి చేరువగన్ ; 46

క. చలితాఁకునొక్కు మెయినె
మ్ములలో దిగఁబాఱి రుధిరమును బేరింపన్

లలితాంగి వణకు చొక్కడ
నిలంబడి, తటాన మేఘనిర్ఘోషముతోఁ ; 47

చ. జలదముఁ జీల్చికొంచు నొకచంచల చంచదుదారకాంతి ది
క్తలముల వ్రేలు సంతమసకాండములం దొలఁగింపఁ జెంగటన్
జలజవిశాలనేత్ర గనెఁ జారుశరీరు వికీర్ణకేశు ను
జ్జ్వలరుధిరాంకచేలుఁ గటిబంధనివేశితశాతఖడ్గునిన్ ; 48

---

# వ న కు మా రి

## ద్వి తీ య మం జ రి

తే. వనిత గనుఁగొన్న వీరుండు వనములందు
మున్నెసరిదారిఁదప్పి తా నెన్నొయెడలు
దిరిగి వేసారి, దూగాన వఱలునెగడిఁ
గాంచి యచ్చోటి కేఁగంగఁ గౌతుకమున , 1

ఉ. ద్వారినిబోవుచుండ నొకతట్టున గొఱ్ఱెలకూయి వీనులం
దూరిన నీప్రదేశమున గొల్లలు కాఁపుర ముందురంచుఁ దా
నారవ మేదెస న్వినియె నయ్యెడ కేఁగుచు నుండఁ జారుశృం
గారరసస్వరూప నల కాంతఁ గనెం [illegible]మందలోన్ ; 2

చ. కని, విసుమానమంది తనకన్నుల నమ్మఁగఁ జాల కీనిశీ
థిని నిబిడాంధకారమునఁ దీవ్రపుజల్లులఁ దోఁగి గొఱ్ఱెమం
ద నెలఁత యొర్తు దోల్కొనిచనం దగుకారణమేమటంచుఁ దా
ననుకొని యంతయుంగనఁగ నావెదురుంబొదచక్కి నుండఁగన్;

క. వచ్చెదుపోలఁతి తటాలున
నచ్చట నీ వీరుఁగాంచి యాశ్చర్యమునన్
రిచ్చవడి యంత సాధ్వస
మెచ్చగ మూర్ఛిల్లి వణకి యిలపై నొరగెన్ ; 4

చ. ఒరగినకాంతఁ గాంచి యయయో! ననుఁగన్గొనియేమొ భీతయై
ధరపయిఁగూలె నిత్తరుణి; దాపున నెయ్యెడ వాసయోగ్యమా

నిరవులుగానరావు; మఱి యెచ్చటికేఁగునో? లేక కొండద్రి
మ్మరులవలె న్వసించునో క్షమాధర ఘోరగుహాంతరంబులన్; 5

చ. లలిత శిరీషమార్దవవిలాసములం దగుచంచలాక్షి గో
త్రాలను గఠోరకంటకదరీముఖభీకరశైలసానుభూ
ములనిటు మేపఁబంచెనయొ మూర్ఖుఁడెవండొ; సుమంబునెవ్వఁడేన్
దలనిడికోక పాదములఁ దాచునె నూపురశించిపోనఁగన్; 6

తే. సృష్టిచిత్రంబు లెవ్వరిచిత్తములను
విస్మయాంభోధిఁ దేల్పవు వివిధగతుల
శిశిరసమయఁ బేల కళలేది చిక్కనలయుఁ ?
బెల్లు పండఁ బూ వేల శోషిల్లనలయు ? 7

క. నిరపాయకరుల నుపకృతి
పరులై వర్తించువారిఁ బాపసమతులం
బొరయును గష్టము లిల, ము
ష్కరులను జేంగఁ బోవు సాహసులనియో ; 8

చ. లలితపు ముత్యపు న్జిగి జలంబులు వాతెడి యూటనీటికా
ల్వలు పలుమాఱు ఆలవలవంతలఁ గుందుచు శీకరాశ్రు సం
కలితములై మనోవ్యథలు గానము సేయఁగ వార్షికాంబుక
శ్మలత వహించు వాహినులుసాఁగునుగాదె నిరర్గళంబుగన్. 9

తే. యామినీకాంత శోకబాష్పాళి యనఁగఁ
బారిజాతప్రసూనముల్ ప్రత్యూషమున
మందశిశిరానిలాహతిఁ గ్రింది కురల
నిలిచి యుండదె తెల్లుపూ నెలల కొలఁది ; 10

చ. అని యిటు లోకవృత్తముల నా యువకుం డొకతప్పుపాటుచిం
తన నొనరించి మంచుచలితాంకున నింపఱువారిజంబురీ
తిని దలపించు నా మదవతీమణి నల్లన నెత్తి, జల్లు పె
ల్చన నమలంబుగందగు శిలాతలమం దుపవిష్టఁ జేయుచున్ ; 11

క. నులి వెచ్చనోటియూపిరిఁ
జెలిమోమున నూఁది, తనదుచేలముఁదడి పిం
డి లలితగతి మైఁ దుడుచుచుఁ
గలయో, సత్యంబొ యనుచుఁ గడుఁదలపోయున్ ; 12

ఆ. కోరకములు విచ్చుతీరుగాఁ గ నిమీలి
తాక్షు లల్లఁ దెఱచి హరిణనేత్ర
వలి యుడంగ మేను వలిపముతో నద్దు
సదయుఁ గాంచి చకితహృదయ యగుచు ; 13

క. పలుకను నోరాడక యెం
దులఁ దాఁ గూర్చుండెనదియుఁ దోఁపక తుదకుం
బలికె సవిస్మయ గద్గద
చలితస్వర యగుచుఁ బొలఁతి చారుమృదూక్తిన్ ; 14

ఉ. ఏయెడనున్నదాననొ ? యిటే సదయాత్ముఁడు సత్కృపం జలిం
బాయ నవార్ద్రచేలమున మైసొగియింపఁగ నద్దువాఁడొ, మా
నాయననుం గుటీరముఁ గనం దగు దా రెది, శోణితాంకితుం
డై యువకుండుదోఁచెనప్పు, డా భయదుం డెట కేఁగెనింతలోన్ ;

చ. అన విని యాకృపాహృదయుఁడంగనఁగాంచిలతాంగి,సాధ్వసం
బున వనరంగ నేల, వెఱపుం గలిగించుపదార్థ మెద్దియున్

నిను స్పృశియింపలేదు; జననీ జనకు ల్వసియించు గేహ మీ
వని నెటనున్నఁగాని తడవంబనిలే దిఁక నిన్నుఁ జేర్చెదన్; 16

ఉ. కాని మఱొక్కప్రశ్న యడుగందలకొంటి, నభీష్ట మైనచో
దాని వచింపుమీ యనినఁ దన్వియు నేను గృతజ్ఞతాంజలిన్
మానక విన్నవింతు నను మాటకు నెంతయు సంతసించి యో
చాన నిశీథినిన్ మలలచక్కని గొఱ్ఱెలఁ దోలనేలకో ? 17

తే. తెలుపుమా యనఁ జిత్తమ్ము కలఁక దేఱి
గొఱ్ఱెకదుపులు పోవుట, వల్లువాఁగు
చెట్టు పుట్టలు వెదకుట, చెలియ యొంటిఁ
జింత మ్రాన్పడి యుంట వచించె నంత ; 18

ఉ. ఆమృదుముగ్ధమైన వచనామృతముం దమిదీఱఁ గ్రోలి, యే
మేమొ మదిం దలంచుచు నహీనవిలాససుధాబ్ధిపూరమం
దా మతిమంతుచూడ్కి కనయంబు మెఱుంగులు తెప్పవేయఁ బ్రే
మామహితాంతరీపమున నై పొగియ న్విహరించు చిట్లనున్;

తే. అసితసూత్రంబులం గూర్పఁ బసలుగుల్కు
మంచిముత్యాలసరములు మదికినచ్చుఁ
గన్యకాచూర్ణకుంతలాగ్రములనుండి
తొలఁకు వర్షాంబుబిందుల చెలువుఁ గనఁగ ; 20

తే. వానజల్లుల వలువలు మేను దడిసి
నీరుఁ జిల్కు నొయారంపునీరజాక్షి
తియ్య తేనియసోనలఁ దిరుగుచున్న
చైత్రమాసపువనలక్ష్మి సౌరుఁ గేరు ; 21

క. అని యిటు యోజించుచు ని
ల్చినయెడ నాపాదశిరము చేడియ నీరుం
గనుచుఁ బరామర్శించియు
మునుపటి కరవాలధరునిపోలిక దోఁపఁ ; 22

తే. ఈతఁడే మున్ను శాతాసి ఘాతిఁగొలుపు
శోణితాంకితచేలంబు, జుంజురులుగఁ
బొదలు కేశాళి గల్గి యపూర్వ మైన
చిత్ర మటు విస్మయంబు రచించె మదిని ; 23

చ. అని తలపోసి పోసి చపలాక్షి యితం డెవఁ డిట్టి రాత్రి ని
వసమున కేలవచ్చెఁ గరవాలము దేటికి, నెత్తు రేమి, నా
యనయటువంటివారె ధరయందు వసింతు రటంచు నెంతు నీ
మనుజుని దేహసౌష్ఠవసమంచితరూపము తండ్రి కున్నదే ?

తే. ఫాలతలమున ముడుతలు పడుటలేమి
దీనభావమ్ము మోమున నూనుకొనమి
వెండ్రుకలు పండి నొసలిపై వ్రేలలేమి
నెసఁగు నన్యోన్యభేదమ్ము లిరువురందు ; 25

తే. ఇతనిఁ గ్రీగంటఁ దిలకింప నేమొగాని
పూర్వహృదయాకులత్వంబు పొడ వడంగి
జనకసందర్శనంబున మనము పొంగు
నటులఁ బ్రమోదయ మ్మయ్యె నని తలంచు ; 26

తే. అవని జనకునికన్నను నన్యమైన
మనుజరూపంబుఁగాంచి యా వనకుమారి

స్వీయ జీవితకావ్యప్రవృత్తియందు
నభినవాశ్వాసరచనకు యత్నపడియె ; 27

తే. అభినవం బైన యనుభూతి నాత్మయందు
నవనవాశయఘూర్ణ ణాం బవతరింప
మునుపు సంకుచితంబుగఁ బొనరు జగతి
విరివిగాఁ దోఁచెఁ ద్రుటిలోనఁ దరుణి కప్పుడు ; 28

మ. కనుగొనెంచి నవప్రపంచ మనియెం గంజాక్షి యావీరునిం
గని, యాలోకనివాసులెల్ల భయముం గల్పించుఖడ్గంబులం
గొని చేలంబులు శోణితాంకములుగాఁ గ్రూరప్రచారంబులన్
దినము లృత్తురె చెప్పుమా, జనకుఁ డీతీరు ల్వచింపండుమున్;

తే. నిన్నుఁ గనుఁగొన్న వికసింప నున్న సుమము
రీతి పొడకట్టు; మాతండ్రి యాతపమ్ము
హాతిని శోషిల్లి వృంతసంచ్యుతిని బొందు
సాంధ్యకాలపుఁ బువ్వ నా సడలు చుండు ; 30

చ. వెలఁది వచించుపల్కులకు విస్మయమొంది,యిదేమి జన్మమా
ది లలిత పుష్ప పత్ర తరుదీప్తి మనోహరమైనకానలం
జెలియ వసించెనో, మనుజచిహ్నము లేవి యెఱుంగదో,భువిం
గలిగిన మంచి సెబ్బరలు గాంచదమాయిక యంచు నిట్లనున్;

తే. సకలతారాశ్రయం బైన చదలు గనఁగ
నెంత విరివిగ్గె చూపట్టు నిలయు నంతె ;
జన్మ మరణముల్ రెండు విశ్రాంతి లేక
జరుగు చుండును నీ ప్రపంచంబునందు ; 32

చ. జననమునొంది, తల్లి తమిసాకఁ బెరింగి, విముగ్ధశైశవం
బున మది నెట్టిదుఃఖమును బూనక యాటలఁ బ్రొద్దుపుచ్చి,యౌ
వనసమయంబునన్ విషయవాంఛలఁ దేలి, జరాగృహీతుఁడై
మనుజుఁడు లోకజీవనము మాని చనుం బరలోక మంగనా

ఆ. అనిన విని లతాంగి యనె నాదుస్మృతి పథ
మంటియుండు శైశవానుభూతి ;
దానిఁ జింతసేయఁ దనరుఁ గన్నులఁ గట్టి
నట్లు బాల్యచర్య లన్ని యిపుడు ; 34

మ. గిరిఁ దీరంబుల నల్లి, ఘుంఘుమరవాకీర్ణప్రవచ్చారుని
ర్ఝరిణీశీకరపోషితంబు లయి యశ్రాంతంబు సౌరభ్యబం
ధురతం బిల్కు లతావితానములఁ బ్రత్యూషంబునం జేరినం
దరవర్ణాంకితపత్రము ల్గలుగుసీతాకోకముల్ పట్టుదున్ ; 35

ఉ. కన్నె వచింప నిట్లు తనుకమ్మున శూరుఁడు వల్కె ముద్దియా
ము న్నెపుడైన నీవు వనభూములు దక్క బహిఃప్రపంచముం
గన్నదిలేదు గాన ధరఁ గల్గిన చిత్రములెల్లఁ జెప్ప నీ
తెన్నున సాఁగ దింటికడఁ దెల్పెద వేగ కదల్పు గొఱ్ఱెలన్ ; 36

మ. వనభూమిన్ గృహమే ప్రదేశమునదై వాఱున్?నినుంగాంచకే
జనకుం డెట్లు తపించువాఁడొ, జననీ సంతాపపాథోధికిం
గన నౌనే యొకమేర? యేలతడయం గళ్యాణి, రావమ్మ ని
న్గని దుష్టాత్మకుఁడేని గీడుదలఁపన్ యత్నించునే యెన్నఁడేన్;

క. కరుణాకలితరసోక్తులఁ
దరుణుఁడు భాషింపఁ బొలఁతి తరళాక్షులలోఁ

బొరలుచు భాష్పకణావళి
యురలఁగ గద్గదరవంబు లొప్పగఁ బలికెఁ ; 38

తే. పాలు ద్రావెడుచిన్నారిప్రాయమందె
మరణమొందెను జనయిత్రి మాన్యనాకు ;
నదియు నేఁ గన నాన్నయేయనియె నెవుడొ;
తల్లులందఱుఁ జత్తురో ధరను జెపుమ ; 39

తే. కుసుమవల్లిక ప్రసవించుకొమరు పువ్వు
వృంత మెడలకయుండునే కాంత, ప్రాచి
గనిన ముద్దులబిడ్డ యా యినుఁడు నపర
సాంధ్యరాగంపుఁ జితిలోన సమసిపోఁడె ; 40

తే. పూవుఁబందిళ్లు క్రొందావిఁ బుక్కిలింప
గున్న లేమావినీడలఁ గూడి, చైత్ర
కాంతుఁ బరిణయ మాడువాసంతలక్ష్మి
యంత మొందదె గ్రీష్మ జరాగమమున ; 41

తే. అవియు నివి యననేల యో యబ్జవదన,
యంతరాళచరిష్ణుఁడౌ నర్కుఁ డాది
యఖిలనక్షత్రచయము కాలానుసృతిని
నైక్యమైపోవు మూలపదార్థమందు ; 42

తే. జలధిఁ దరఁగలుపుట్టుచు సమసిపోయి
మరల జనియించునోజ నో హరిణనయన,
ప్రకృతిమార్పులఁ జెందుచుఁ బరఁగుగాని
వ్యయము నుత్పత్తి లేదు మూలాంశమందు ; 43

చ. అన విని యాలతాంగి వ్యసనాకులచిత్తత నిల్చివల్కె నో
మనుజవరేణ్య, యీవిషమమార్గము దప్పదొ, నీవునేను మా
జనకుఁడుసర్వమున్ స్మృతివిషాదమునందుట!చాలునోయి యీ
మన మెరియించుబోధనలు, మందఁగదల్చెదఁబోద మింటికిన్;

ఉ. నా విని యక్కైకా కని వనంబుల గొఱ్ఱెలఁదోలికొంచు శం
కావిల యా నెలంత దరి నవ్వలనివ్వల ముందువెన్కలం
గావలయైన సత్త్వతతి గన్పడునంచుఁ గృపాణపాణి యై
పోవుచు నుండె నప్పురుషపుంగవుఁ డామెకుఁ దోడునీడయై;

# వ న కు మా రి

## తృ తీ య మ ం జ రి

---

చ. అనయమునింపుగన్ సుమలతావళి చెట్టులకల్లి మేలుక
ట్లను దలపించు కాననతలంబునఁ దాళ పలాశ శాల వృ
ద్ధనరుఁ డొకండు వెల్వడి వ్యథాభరకుంచితఫాలభాగుఁడై
కనదనలంబునం జిదుగుకంపలు వైచుచు, వెచ్చ నూర్చుచున్;

క. పలుమాఱులేచి యటునిటు
నలుదెసలం జూచిచూచి నయనంబుల జొ
బ్బిలుబాష్పకణము లూడ్చుచుఁ
బలవించుచుఁ జొచ్చు వెడలుఁ బర్ణగృహంబున్; 2

చ. అఱువదివత్సరంబులకు నవ్వలిమాటయెగాని లొచ్చులే
దరయఁగఁ బ్రాయమాతనికి నాయతఫాలము దీర్ఘబాహువుల్
గరము వెడందవక్షమును గంధర యుబ్బు శరీర సత్త్వని
ర్భరత నుపన్యసించు, మది రంజిల దెప్పుడు శాంతి సుంతయేన్;

తే. హరిణచర్మ్ముపఱచిన యరుఁగుమీఁదఁ
గూరుచుండి యావృద్ధుఁడు కొంతవఱకు
నట్టెయుండి చివుక్కున ద్వారసీమ
కరిగి యటుచూచి యొకకొంత యాలకించి; 4

తే. వచ్చితే, యింతసేపేమె వనకుమారి,
రమ్ము, యని పల్కఁ బ్రత్యుత్తరమ్ము రామిఁ

బవనకంపిత పర్ణనిస్వన మటంచు
నతఁడు చను లోని కెంతొ హతాశుఁ డగుచు ; 5

క. మునుపటియట్టుల శోకము
తను నలమఁగ వేదిమీఁదఁ దడవుండి స్మృతిం
దనరెడు పూర్వోన్నత్యము
మనమునఁ దలపోసికొంచు మాటాడుకొనున్ ; 6

చ. కనుఁగొనవచ్చునే సమయగర్భమునం దెటువంటిచిత్రముల్
జననమునొందునో? యపరసాంధ్యవిలేఖిని పశ్చిమాశనే
దినమున నెట్టిరూపములఁ దీర్చునొ చెప్పఁగ నౌనె సత్కవీ
శునికినిసైతముం; బ్రకృతిసూత్రసమన్వయ మూహ కందునే?

చ. పుడమిని బ్రాఁకుపుర్వుఁ జిఱు పుల్గలపుల్గును డేగ దానివ్యా
ధుఁడు నిజపోషణార్థమయి త్రుంచుఁ; బరస్పర మిట్లి పోరుచే
పడి యిహలోకజీవనము వ్రాలుఁ దనంతన హెచ్చు లొచ్చులం;
గడిమిని యాశ్రయించుఁ గలకాలము నైహికభోగసంపదల్;

చ. వననిధి నూర్మికల్ పఱచు పందెములం దిలకింప లోకజీ
వనపురహస్యముం దెలియవచ్చును, ముం జరియించువీచికం
జెనకును మీఁదిపెందరఁగ; చేడ్పఱుచు న్మఱియొండుదాని నై
జనియతి నిట్టులే భువనచక్ర మశేషము సంభ్రమించెడున్;

సీ. పరిణామశక్తి శాశ్వతముగఁ గాలచ
క్రమునకు మనుజసంఘములఁ గట్టి
త్రిప్పుచుండుటచే నొకప్పుడు కొన్నిసం
ఘము లుత్తమస్థితి గలిగియుండు;

మఱికొన్ని యధమసమ్మానంబు నొందును
నవియె విజృంభించు నవలఁ దొడరి;
సమయచక్రాహతిఁ జదునై నరాజ్యమ్ము
లెన్నియో చారిత్ర మెఱుఁగఁగలదు;
తే. ఆదిమధ్యాంతరహితకాలాబ్ధియందు
నిట్టిమార్పులు బుడగలయట్టు లుండు;
నిన్ని తలపోయ నామది నున్నయూహ
పట్టులేకయ భ్రమియించు బహుళగతుల; 10

చ. పరులకునోడి రాజ్యరమ, బంధుల వీడి, సమస్తసౌఖ్యముల్
దొఱఁగి వనీనివాసమున దుఃఖమునొందుచు నేకపుత్త్రి సుం
దరి సుమకోమలం బ్రకృతితత్త్వ మెఱుంగని ముద్దరాలి స్వో
దర పరిపోషణార్థవశతన్ నియమించితి మందఁ గాయఁగన్; 11

తే. రాజ్యభోగంబు లొందు ధరాతలేంద్రు
నన్నుఁ బరవీరభైరవుఁ జిన్నపుచ్చి
వననివాసంబునకు నలవాటుపఱిచె
నౌర! దుష్కాలమహిమ; యేమనఁగవచ్చు; 12

క. నాకయి పలవింపను బ్రే
మాకలితార్ద్రహృదయఁ గుసుమాంగి సుతం గ
ష్టాకులమతిఁ జేసితి నని
శోకించెదఁ జిత్తకళిక శోషిల్లంగన్; 13

సీ. పట్టుపొత్తులలోనఁ బన్నుండుగతి మాలి
పులితోలుపై మేను మోపవలసె;

సౌధోపవనకేళిఁ జరియింప నోఁచక
గిరులఁ గాననములఁ దిరుగవలసెఁ;
గనకాంబరంబులఁ గై సేయుసిరిలేక
మోటుకంబళి మేన మోయవలసె;
నంతఃపురీభోగ మనుభవించుటలేక
పర్ణశాలలఁ గష్టపడఁగవలసె;

తే. ఆఁకలెట్టిదో యెఱుఁగక యావుపాలు
కండచక్కెర యుక్కెఱ గడ్డపెరుఁగు
వెన్న మీఁగడ భుజియించు నన్నుమిన్న
కసవుకూళుల నరపొట్ట మొసవవలసె; 14

తే. రాజ్యసంచ్యుతుఁ డైన ధరామహేంద్రు
తనయ తానంచు నెఱుఁగదు వనకుమారి;
పలవరింపదో చి త్తమ్మపగుల నెప్పు
డైన సత్యమ్ము తెలియంగ నైన నయ్యొ!; 15

ఉ. ఏమొకో యింతసేపువఱ కెయ్యెడనున్నదొ ముద్దుపట్టి, పె
న్పాములుఁబుర్వులుందిరుగుబాటల,లోయలఁ గ్రూరసత్త్వము
ల్వేమఱు బొబ్బవెట్టుఁ; గదలించిన గొఱ్ఱెలమంద పెంజడిం
బో మరలింపలేకిడుమఁబొందుచునున్నదొ చిమ్మచీఁకటిన్; 16

చ. అని యిటు వృద్ధరాజు తనయ న్వెదకంగఁదలంచి తీవపం
జును వెలిగించి చేకొని ముసుంగుగఁ గంబళి గప్పి చిట్కుమం
చనయము వర్షబిందుతతు లాకులపై దిగఁజాఱె రాల న
ల్లన వనదుర్గమాంతరములం జనుచుండఁగ నొక్కచోటునన్;

చ. ఎల గురి వెందవల్లిక లనేకవిధంబుల నల్లిబిల్లిగా
మెలిగొనియుండ నందు మిడిమేలపుశల్యమృగంబు శాబకం
బులఁ గని సొమ్మసిల్లి యరమూర్ఛఁబరుండి తటాన ఁజెంగటన్
వెలుఁగునుగాంచి తత్తఱము పెల్లడరం బొద దాఁటెరివ్వనన్;

మ. తనలోఁ దా సుకుమారబాలికకుఁ బ్రాప్తంబైన యిక్కట్టులె
ల్లను జంతించుచు డోలికాచలనలీలం గేరుచిత్తంబుతోఁ
జను వృద్ధున్ వెనుచక్కిఁ బిక్కలదరన్ శల్యంబుకొమ్మెత్తి పె
ల్చనఁగూలంబడడొక్కలోఁబొడిచెఁ గీలాలంబు జొబ్బిల్లఁగన్;

ఉ. పోటున రక్తపూరములు పొంపిరిపోవఁగఁ జేలపొత్తులం
బాటిగ నద్ది నొప్పులకు వందురుచున్, సుత నెట్లుగాంతు ని
ప్పాటును దెచ్చిపెట్టెఁ గట! పాపపుదైవము నిర్దయామతిన్;
ఓటమినాఁడె పోర మృతినొందినఁ గష్టము లిన్ని గల్గునే? 20

మ. పరభూమీశుల సంగరాంగణములన్ బాహాబలస్ఫూర్తిఁ గ
ర్కరఖడ్గంబునఁద్రుంచుటో, యరులచేఁ బ్రాణంబుఁగోల్పోవుటో
సరి గా క్షత్రియవీరపుంగవునకున్; సామ్రాజ్యముం బాసి ని
ర్భరశోకమ్మునఁ గాననాంతరముల న్వాసింపఁగాఁ జెల్లునే ? 21

చ. అనయము మత్కుమారి నయనాంచల ముగ్ధవిలోకనామృతం
బున ననుముంచుచుంటఁ బ్రియపుత్రికినై కడగండ్లనొందియున్
మనుటయుఁ బూర్వపుణ్యమని మాటికి నే ననుకొందుఁగాని జీ
వనసుఖ మిచ్చగించి వనవాసమొనర్తునె యట్లుగానిచో; 22

చ. చిఱుతతనమ్మునుండి వనసీమలఁ గొండల నుంట లోకమే
యెఱుఁగనిముద్దరాలు సుత; యేగతినే మృతినొంద నొంటికాఁ

పుర మొనరింప నోపు వెఱపుం గఱపించు వనాంతరమ్ములం;
బురమున కేఁగి దైన నొకపూరాట వసింపఁగఁజాలునే కటా!!23

తే. పరిణయార్హవయస్కయుఁ బ్రణయజలధి
నోలలాడెడు పూఁటేఁకుటోడ తనయ
భీకరారణ్యతలముల బెగ్గిలంగ
మఱుఁగుపఱచునో మరణంపుమబ్బు నన్ను; 24

తే. అల్లుపందిరి నెడఁబాప నలరుతీవ
పట్టులేకయ యటునిటు ప్రాఁకురీతి
మరణమొందఁగ నేను, నిర్భరతరార్తి
నెటులఁ బెఱపంచలం బ్రాఁక నేఁగుఁ బుత్రి; 25

చ. అని యిటు, తేలుగుట్టినటు లాఁగనిపోటులు డొక్కలోఁ గలం
చిన నిలుసేరనెంచి యిలఁ జేయిడి లేవఁగడంగఁ గన్నుల
ల్లనఁ దిరుగంగసాఁగె; నొడలం జెఱుచెమ్మట లుప్పతిల్లె; ద
ప్పినిగొనిశక్తిచాలక భువిన్ శయనించె నతండుమూల్గుచున్;

చ. మరణముగాంతునం చిఁకఁ గుమారికి నెవ్వరు నెప్పువార లీ
మరణపుశయ్యనైన నొకమాఱు ప్రియాత్మజఁగౌగిలించి ము
మ్మరమగుకూర్మితియ్యమునమంజులఫాలముమూర్కొనంగ ని
త్తఱి లభియించునే కటికదైవమ!యంచుఁ దలంచికుందెడిన్;

---

# వనకుమారి

## చతుర్థమంజరి

---

క. మందను దోల్కొనివచ్చెడు
సుందరియును దరుణుఁ డప్డు శుష్కపలాశ
స్పందారవ మెట వినఁబడు
నం దాఁగుచు మరలఁ జనుదు రటవీవీథిన్ ; 1

శా. ఆరీతిం జనుదెంచుచుండ నొకచో నక్కానలో గాలిలోఁ
ఘోరంబై పరికీర్ణమై మిళితమై తోఁచె న్విరావంబు, లా
ధీరుం డా రవ మాలకించి నిలువన్ దీనోక్తులున్ మూల్గులున్
ఘోరావస్థఁ గలంగుమానవునిపల్కుల్గాఁగఁ జూపట్టెన్; 2

క. కాంతఁ గనుంగొని యిట్లనెఁ
జింతాపీడితుఁ డెవండొ చీఁకటికోనన్
వంతలఁ గుందుచు మూల్గుచుఁ
బ్రాంతంబుల నున్నవాఁడు, వ్యథ యెట్టిదియో; 3

ఉ. నే నటుపోయి వత్తుఁ దరుణీమణి, బాధితుఁ డైనమానవుం
బూనిక రక్షసేయ మదిపుట్టనివాని హృదంతరంబు మ్రా
నో, నెఱిచిట్టెమో, కులిశమో యన నౌను; బరార్తిచాలితం
బై నవనీతమార్దవము నందనిచో నది మానుషాత్మమే? 4

చ. అని యిటువల్కి యచ్చెలువ నచ్చటనుండఁగఁ బంచి ఖడ్గముం
దనకరమందుఁ దాల్చి కడుధైర్యమునం జని యొక్కతావునం

మనుజుఁ డొకండు నేలఁబడి మాటికి లేవఁగడంగుచున్ మొయిం
దనరెడి నొప్పి రాపిడికిఁ దాళకఁ మూల్గుటఁ జూచి యిట్లనున్; 5

క. అయ్యా, మీ రెవ రివ్వనిఁ
గుయ్యిడుచుండెదరు; నేలఁగూలుట కిం దే
మయ్యెను దెల్పుఁడు, నాచే
నయ్యెడుసాహాయ్య మున్న నది యొనరింతున్ ; 6

క. కరుణారసనిష్యందము
లరుసపువాక్యములు వీను లలరఁగ విని యా
తురతన్ వృద్ధుఁడు కన్నులఁ
దెఱచి శరీరము నిగుడ్చి దీనతఁ బలికెన్ ; 7

క. తలఁపనితలఁపుగ వచ్చితి
తలకొంటివి రక్షకొఱకుఁ దడయక వని క
వ్వలఁ గ్రోసెడుదూరము చనఁ
గలదుకుటీరంబు, నన్నుఁ గడపుము యటకున్ ; 8

క. అలనుం గొని యామీఁదట
దెలిపెద నాచరిత సేద దేఱిన వెనుకన్;
బలహీనత, మాంద్యమున
న్నలయించెడు జాగు సేయ కటు గొనిపొమ్మా ; 9

క. అని యిటుపల్కుచు ముద్దుల
తనయుం దలపోసిపోసి తలఁగనిదుఃఖ
మ్మునఁ గుంది వనకుమారీ,
యని యొకనిట్టూర్పు విడిచె నశ్రులతోడన్ ; 10

ఆ. వృద్ధుఁ డిటులఁబల్కఁ విని యను యువకుండు
వనకుమారియెవతె? వనములందు
నామెయున్నదొక్కొ యలఁతిప్రాయపుఁగన్నె
గొఱెలమేప గిరులఁ దిరుగుచున్నె ? 11

తే. మృత్యుదేవతకోఱల మిడుకుచున్న
వాని కమృతంబు దొరకినపగిది నంరి
ముసలిఱేఁడను, గానల ముద్దుకూఁతుఁ
జూచినాఁడవె గొఱియలఁగాచు చుండ; 12

క. అవు నవు నని తలయూఁచుచు
యువకుఁడు విస్మయమునొంది యుర్వికి డాకాల్
దవ్రులంగ వంచి వృద్ధుని
యవయవములు హస్తపాళి నంటుచు నుండన్; 13

క. మల నెటులున్నది నా క
న్నులవెన్నెల, ప్రాణపద, మనుంగుతనయ, జ
ల్లుల వలివడి వడఁకుచు గొ
ఱ్ఱెలఁదోల్కొని చీఁకటిని గిరిం దిగఁ గంటే; 14

క. సెలయేళ్ళ నెటుల దాఁటెనొ
పులులుం దోఁడేళ్లు శివలు బొబ్బలువెట్టన్
లలితాంగిచిత్త మేగతిఁ
గలఁగెనొ యని వృద్ధరాజు కటకటపడియెన్ ; 15

ఉ. వందురఁబోకు మామె నిరపాయత నున్నది మందతోడ, నీ
వెందుకుమూల్గు చుంటి వచియింపవ దేమొకో, వ్యాధిబాధచే

గుండెదవో, వనోర్వీఁబురుగు ల్విషసర్పము లేవియైనఁగా
బొందఁగముట్టెనో చెప్పుమ, యొప్పగుసేఁతయొన ర్తమి త్రితిన్;

ఉ. చెప్పకయేమిగాని మృదుచిత్తుఁడ, మత్సుత కీయుదంతముం
జెప్పిన నప్పుడే పొగులుఁ జిత్తము శోకవిపాటితంబుగన్;
అప్పొలఁతింగనుంగొన వనాంతరసీముం జొరఁబాఱు చుండఁగా
గుప్పునశల్యమొం డిచటఁగొమ్మునఁగ్రుమ్మెను డొక్కనెమ్మలన్;

క. నెత్తుట జొత్తిలె నంగము
చిత్తమ్ము త్తలము నొందెఁ జెవులను గీమం
చొత్తెను శబ్దం బెద్దియొ,
బొత్తిగఁ గాయంబు సడలె మూర్ఛాపిల మై; 18

చ. అనవుడు వీరుఁ డిట్లనియె నయ్యయొ! యివ్విధి నుండ నూరకే
మన మిటజాగుసేయఁగఁ బ్రమాదమువాటిలునేమొ, వేగమే
తనయనుదెత్తు,నందఱముఁదద్గృహసీమకుఁబోదమంచుఁ దా
నన విని వృద్ధుఁ డిట్లనియె నయ్య, కుమారికి నేమిసెప్పెదో;19

చ. జనకుఁడు కుక్షివేదన మసంగఁగఁ, దాళక మూల్గుచున్నవాఁ
డని వచియింపుమీ యనిన, నట్టులెకా కని యంధకారికా
ననమున వేగవేగ చని నాతుక భీతిలు చుండఁ గాంచి యో
వనిత,గదల్పు గొఱ్ఱెలను బల్కెద నవ్వలవృత్త మంతయున్;

క. నినునన్వేషించుచు వని
జనకుఁడు రా నుదరబాధ జనియించినఁ బో
వను రాను శక్తి చాలమిఁ
బనవుచుఁ బడి యున్నవాఁడు పచ్చికబయలన్; 21

చ. ఇఁక నొక తెప్పపాటయిన నిందుఁ జరింపఁగరాదు, పోద మో
చకితకురంగనేత్ర యనఁ జిత్తముకాండము వ్రీలిపోయిన
ట్లొకటియు భావన న్నిలుపనోపక యూఁపఁగలేనిశోకముం
బ్రకటముసేయు బాష్పనికరంబులఁ గోళులమీటు చి ట్లనున్;

శా. కన్నుల్ గానఁడు వృద్ధుఁ డొంటి, మఱి యీకాంతార దేశమ్మునన్
మన్నున్ మిన్నును నెఱుంగరాక తమముల్ మార్గమ్ము రోధించి క్ర
మ్మెన్నల్ ప్రక్కల నాన్న జల్లులకు బత్తే నెల్లఁ గంపిల్లఁగన్
నన్నుం గానక కానల న్వెదకుచున్నాఁడేమొ శోకార్తుఁడై;

మ. పొలఁతీ, చింతిలనేల వేగ నొఱెలంబోఁదోలు మంభోదముల్
బలమయ్యెన్ దిశలందు,మార్గము తమల్ పల్లంబులు న్మిట్టలుం
దెలియన్రా విట; శీతలానిలహతిన్ దేహమ్ము వ్రానయ్యె; భూ
స్థలి జాగ్రత్తగ మెట్టుమీ; జనకునిన్ దర్శింత మిచ్చోటనే; 24

ఆ. పిఱుఁ డిటులఁబల్కి వెలఁదియుఁ జిత్తమ్ము
లేని కీలుబొమ్మలీల గొఱెల
దోలికొంచుఁ జనియెఁ దోఁడురాయునకుండు
ఖడ్గపాణియగుచుఁ గడిమిమెఱయ; 25

చ. జనకునిఁగాంచఁ జిత్తజలజాతము శోషిలి కాంతయున్ ఘనా
ఘనపతితాంబుబిందులటుగాఁ దరళాశ్రులు కంఠసీమకుం
దొనకఁగ నేడ్వఁ దండ్రియును దోరపుటుమ్మలికమ్ము మ్రింగి యి
ట్లనియెను గద్గదస్వరము లస్ఫుటమై పవనార్భటిం దగన్; 26

శా. అమ్మా ముద్దులగున్న యేల మలసంధ్యారాగము ల్వాయ మే
ఘమ్ము ల్గ్రమ్మగ నొంటి నుంటివి, జడిం గంపమ్ము వాటిల్ల దే?

నెమ్మె నగ్గురునొందదే చలికిఁ; జన్నె యిట్లు వర్షమ్మునం
జెమ్మ లాఁటిన బాటల న్నడువఁ; గొంచెమ్మైన భీతిల్ల వే? 27

చ. వనతరువాటికా మృదులపల్లవపాళుల సంజకెంజిగుల్
సన, నిను వేచుచుంటిని విచారశరాకులితాత్మ్మతన్, సుధా
జనకమనోహరస్మితముఁ జల్లెడు నీ రుచిరాస్యబింబముం
గనఁ గుతుకంబునం జెలఁగు కన్నులనించుక యప్పళించుచున్;

సీ. వనతరుచ్ఛాయల వనధరచ్ఛాయల
నంధకారము సాంద్ర మగుచు నెఱయ,
మార్గమ్ముఁ గానక దుర్గమారణ్యానిఁ
బెడత్రోవఁ బట్టితో ప్రియతనూజ,
గిరిగహ్వరంబుల హరిపుండరీకాది
మృగగర్జలకుఁ జిత్త మెట్లదరెనో
పర్వతాగ్రములందుఁ బర్విడు సెలయేళ్ళ
వఱ్ఱు వాఁగుల దాఁట వలనుపడెనె,

తే. నదిని బడిపోవువానికి నావయటులు
పూర్వసుకృత విశేష సంభూతిచేత,
భవ్యుఁ డీతఁడు దైవంబుపగిది వచ్చి
నిన్ను రక్షించి నన్నుఁ జేర్చెఁ గన్నతల్లి; 29

క. అన విని తనయయు నేనూ
జనకునకు వచింపఁ బోవ జాగగునని యి
ట్లనియెను వీరవతంసుఁడు
జనకునిసుతఁ గాంచి మధురశాంతరసోక్తిన్; 30

తే. చనదు భాషింప నిటుఁ బరస్పరము మీరు
వాసమున కేఁగి సర్వంబుఁ బలుకవచ్చు,
వర్ష చిహ్నము లాకాశపదమునందుఁ
గలుగుచున్నవి పోదము కానదాఁటి; 31

తే. అనుచు యువకుండు వృద్ధుని నట్టె యెత్తి
వీఁపుపై వైచికొని వనవీథి వెడలె ;
వనకుమారియు గొఱ్ఱెల బాదికొంచు
నతిరయంబున నాతని ననుసరించె; 32

చ. చని చని యొక్కచో దహనసంస్థితి గాంచి, యదే కుటీరమం
చనుకొని దారిపట్టెను రయంబుగ వీరుఁడు, పోనుబోను నా
తనికి లతానికుంజవలితంబుగ నొక్కగృహంబు వెల్గునం
గనఁబడెఁ దాపసాశ్రమవికాసముఁ జిల్కుచుఁ జూడ నందమై;

ఆ. అంత వనకుమారి యనియె నిటుల నయ్య
యిదియె మాకుటీర మిందుఁ జొరుము,
దొడ్డిపెట్టి గొఱ్ఱెతుటుములు నే వత్తు
ననిన నట్లకాక యనియె నతఁడు; 34

ఆ. ఆలయంబుఁ జొచ్చి యజినం బరుంగుపైఁ
బఱచి యుంటఁ గాంచి బాగుపఱచి
వృద్ధు నల్ల దింపి వేదిపై శయనింపఁ
బెట్టి, యంత వీరు డిట్టు లనియె ; 35

చ. తొలుత గవోష్ణతోయములతోఁ గడుగన్వలె నెత్తురవ్వలన్
లలితమృణాలతంతుకిసలంబులఁ బొత్తిగఁ జేసి గాయమం

దొలికెడు నస్రబిందుతతు లొప్పుగ నద్ది శిరీషపుష్పపే
శల వసనాంచలంబున నెస స్రచియించెదఁ గట్టునొవ్వఁగన్;

చ. గోటియల దోడ్డిఁదోలి యిటకున్ సుమకోమల వచ్చునంతకుం
ద్వారికగతిన్ రచింపవలె బంధము, నట్టు లొనర్పకున్న న
త్తరుణియుఁ గ్రొత్తనెత్తురులు ధారలుగా స్రవియింపఁగాంచియు
ద్ధురహృదయాకులత్వమున దుఃఖపయోధిని మున్గిపోవదే; 37

మ. అని యీరీతివచించు నయ్యువకు నయ్యా, యేలబంధంబు, పో
యెను గీలాలము రక్తనాళముల, నిం కేలీల నాప్రాణముల్
ఘను నిమ్మేన, వృథాప్రయాసపడఁగన్ లాభంబె; నిస్సత్వభా
జన మయ్యెన్ సకలాంగకంబులును; వాచాశక్తి జీర్ణించెడిన్ ;

క. అనిపల్కి, యంత వృద్ధుఁడు
మనమునఁ దలపోసి యిటుల మందా స్ఫుటలీ
లను వచియించెను గన్నులఁ
దొనికి శ్రుతిపుటముల నశ్రుతోయము జాఱన్; 39

క. కడచెను బదునే డేఁడులు
పడితిమి పడరానిపాట్లు వనసీమల, మా
యిడుమలకు లెక్కగలదే
కుడిచితిమి మునీశులట్లు కూరలుఁ గాయల్; 40

ఉ. నా విని వీరుఁ డిట్లనె మనం బనుకంప వహింపఁ, బూజ్యుఁడా,
యీవనభూమినేల లలితేక్షణతో సుకుమారబాలతో
నేవిభవంబుగోరక మునీశులలీల వసింతు చెప్పుమా
నాపుడు వృద్ధరా జనియె నమ్రముఖంబు నిగుడ్చి చూచుచున్;

మ. ధరనష్టాదశవత్సరంబులు భుజాదర్పంబునన్ శాత్రవో
త్కరముం ద్రుంచి ప్రజాప్రమోదకరసౌఖ్యస్ఫూర్తిఁ బాలించితిన్;
న్నరనాథుల్ నను నిత్యముం గొలువ దిఙ్నాగాస్యపత్త్రంబులం
దరళామేయయశోంకురంబుల లసత్ఖడ్గంబునన్ వ్రాసితిన్; 42

ఉ. కాలమహత్త్వ మెవ్వరికిఁ గన్గొనరాదు, ప్రతిక్షణంబుఁ గా
ర్యాళి యయత్నలబ్ధమగుఁ; గల్గవు కొన్ని ప్రయత్నయుక్తినేన్
లీల లయించు భాగ్య; మవలీల దరిద్రత పోవు; నిట్టులే
తేలును మున్గుఁ గాలజలధిన్ సకలంబును నస్వతంత్రతన్; 43

తే. కష్టజీవితు కన్నీటికాల్వ కైనఁ
గాలచక్రము నిలువదు కనికరమున,
ధారుణీపాల పాలనాదండమునకు
వెఱచి యాఁగదు; త్రుటిమైన విరతిఁ గొనదు; 44

తే. కాలసాగరకల్లోల కాండచలిత
తృణగణంబులు ప్రాణులు: స్థిరత లేదు;
రాజ్యములు, సంఘములు, నాగరకత లెల్ల
నిట్టిన్యాయమునన్ భ్రమియించుచుండు; 45

తే. ఎవని విశ్వాసపాత్రుఁడే యటంచు
నాత్మ నమ్మితి నా యమాత్యాధముండు
పర నరేశుని కేకాంతభక్తుఁ డగుచు
స్వామి వంచించెఁ బ్రబలసంగ్రామసీమ; 46

చ. పరధరణీశుఁ డొక్కరుఁడు బాహుబలోద్ధతిమీఱఁ గేరి యు
ద్ధురపృతనాసమేతుఁ డయి దుర్గము లగ్గలుపట్టె, మంత్రి మా

పురమున నున్న సైన్యములఁ బోఁబనిచె న్నిమషమ్మునన్ వెట్టి కాననాం
తరముల కయ్యెడం; గపటతంత్రుని మంత్రిని నమ్మి కూలితిన్;

చ. తరుణమునందు నన్విడిచి దాయలకు న్విజయంబుగూర్చు ము
ష్కరతనహింపఁ బోని బలశాలురు యుద్ధకళాఢ్యులైనకాం
ద అపుడు స్వామిభక్తులయి దర్పమెలర్పఁగఁ దోడు నిల్చి భీ
కర సమరప్రకారములఁ గాటియ వెట్టిరి శత్రుసేనలన్; 48

ఉ. వైరులు బొమ్మలాటలవలె భావముగోల్పడి యూరకుండ దు
ర్వారరణంబున న్విమతవాహినులం గలగుండు వెట్టుచున్
ధీరులు మానువిక్రము, లుదీర్ణపరాక్రమకేళి లోలురై
పోరిరి మత్తపుష్కరులు పుష్కరిణిం గలగించునట్లుగన్; 49

చ. అయిన నదేమొ శత్రుజన మంతకునంత కనంతమై సమి
జ్జయశుభసూచకారవము సల్పుచు వార్ధివిలోలవీచికా
చయములు మధ్యపర్వతపుఁజాలులఁ దాఁకెడురీతి హేతులన్
హయరథమత్తకుంభి పృతనానుథనంబుగఁ దాఁకి రెంతయున్;

క. నాకై ప్రాణము విడిచెను
నీకన్నాసైన్య మెల్ల వీరస్వర్గ
శ్రీకమ్ముగ, నరుదెంచితి
నీకష్టము లనుభవింప నే నివ్వనికిన్; 51

మ. పరభూపాల కరాళకంఠదళన ప్రారంభదుర్వారమౌ
కరవాలంబు, శరాసనంబు నిషువుల్ కాత్తసర్వోరశ్ఛదం,
బురు శీర్షణ్యము భూమిదాఁచితిని నయ్యో! శౌర్యచిహ్నంబు లి
ద్ధరగర్భంబునఁ ద్రుప్పుపట్టెడిని; తూత్రస్సూప్తియిట్లాయెనే!

చ. అన విని వీరపుంగవుఁడు నంగమునం బులకల్జనింపఁ, గ
న్గొనలఁ గిసాలశోణిమము గూడఁగ దిగ్గన లేచి చూచి యి
ట్లనియె నిశాతఖడ్గముఁ గరాబ్జమునన్ ధరియించి, చెప్పు మో
ఘనుఁడ నిన్ను సమిద్ధరణిఁ గాఱియవెట్టిన దుష్టభూపతిన్;

చ. బలయుతశత్రురాజ పరివార నివారణ కేళి దుర్దమం
బు, లసితరత్నముష్టియుఁ జమూపటుకంఠనవాస్త్రపాయి, యు
జ్జ్వలదరుణాంశుసన్నిభము, శౌర్యపరాక్రమచిహ్న మిందిరా
కలితము మత్కృపాణి, యనిఁ గ్రుల్లఁగ నా కెదు రేరి శూరులన్;

క. అనవిని వృద్ధుం డిట్లనె,
మనుజానిపుఁ డింద్ర సేన మహోగ్రల్యుఁడు నన్
గనికరములేక వంచన
ఘనరాజ్యచ్యుతునిఁ జేసి కానల కనిచెన్; 55

చ. తరుణుఁడు,నయ్యుదంతముశతారము పేరెదసొచ్చి యట్టిటుల్
మెఱమినయట్లొనర్ప, నసి మేదిని జాఱఁగ మారుతంబు ని
ర్భరగతి వీవ మొగ్గుచు ధరంబడు నా కదళీప్రకాండమ
ట్లొరగెను; నంతలోనఁ జెలియుం జనుదెంచెఁ గుటీరసీమకున్;

# వనకుమారి

## పంచమ మంజరి

---

క. ఆతనిఁ గని చిత్తమ్మున
భీతి పెనంగొనఁగఁ జనకుఁ బృచ్ఛించెను నా
శాతోదరి యేలొకో యీ
భాతిని వీరుండు ధరణిఁబడియెను జెపుమా; 1

క. అన విని తండ్రియు నిట్లనెఁ
దనయా, మూర్ఛిల్లెనేమొ తరుణుఁడు, జలముం
గొని మోమునఁ జిలికింపుము
కనుదమ్ముల నెత్తుననినఁ, గానిమ్మనుచున్ ; 2

తే. కమలినీపత్రపాత్రాన విమలజలముఁ
దెచ్చి మోమునఁ జిలికించి తీవఁబోణి
యంగుళీపల్లవంబుల నల్లనల్ల
నాస్యబింబమ్ము స్పృశియించు నంతలోన; 3

క. వీరుఁడు నిర్నిద్రుఁడు గాఁ
గా, రమణీమణి విశేషకౌతూహలమొ
ప్పారఁగ జనకుం గనుటకుఁ
దారెను నవ్వేదియున్నతట్టున కంతన్ ; 4

ఉ. శారదశీర్ణపర్ణముల చాయలఁ దేలుచు వెల్లనౌ వ్యథా
భారసమంకిత భ్రుకుటి ఫాలము, జీవకళావిహీన దృ
గ్వారలతాలవాల మగు కన్నులుగాంచి యిదేమి రక్తసం
చారము రుద్ధమయ్యెనొకొ, చల్లఁబడెం దను వెల్లఁ జెమ్మటన్;

చ. అనుచు నిటాలఘర్మకణికావళిఁ గుంటెల రౌప్యసూత్రముల్
మునుఁగుచుఁ దేలుచుం గనులమూఁగ, నిగారపుఁ బైటచెంగున
న్జనకుని మోము నద్ది విలసన్నవపల్లవకోమలంబు నా
తన యధరోష్ఠముల్ గదిపెఁ దండ్రికపోలముఁ గాంతప్రీతితోన్;

ఉ. కన్నుల బాష్పపూరములు గాఱుచు వీనులనంటి జాఱ, నా
సన్నమృతిం గనుంగొని విచారముతో జనకుండు పల్కె నా
కన్నుల వెన్నెలా, తనయ, కాలపయోనిధి బుద్బుదంబు నా
నిన్నెలవుం ద్యజించి దివి కేఁగుదినం బరుదెంచె నిత్తఱిన్; 7

చ. లలితవసంతవేళఁ గిసలంబులఁ దావులఁ జల్లుపూల ను
జ్జ్వలలగు వల్లికల్ తమదు చక్కఁదనంబు శరత్సమాగమం
బలవడ నోడి పండు వగుటాకుల రాల్చుచు నస్థిపంజరం
బులౌ యనునట్లు చూపఱులఁ బొక్కఁగఁ జేయు నహృద్యరూపతన్

ఉ. కావున నెట్టివారలును గాలముడాయ సమస్తవైభవం
బే విధినైనఁ బాసి దివి కేఁగక తప్పదు, మృత్యుదేవతా
భావమునన్ దరిద్రులని భాగ్యయశఃప్రథితాత్ములంచు సం
భావన యున్నె; కూటమియుఁ బాయుట నిత్యనిసర్గధర్మముల్;

మ. మరణద్వారకవాటముం దెఱచి సన్మానింప మీతల్లి ప్రే
మరసావిష్కృతదృష్టుల న్నెఱపి యమ్మా, నన్నుఁ గన్నన్నలన్

వరగంగాసికతాప్రదేశములఁ గల్పత్ర్మాజకుంజాలయాం
తరితచ్ఛాయల విశ్రమింపఁ బిలిచెం దాపమ్ము శాంతింపఁగన్;

మ. జనకుండిట్టులఁ బల్కఁ గూఁతురనె నాశ్చర్యంబుదోఁపంగ, మా
జననింజూచుట కేఁగెదో దివికిఁ జంచద్గాంగకల్లోలసం
జనితాలోలమరుత్కిశోరములు విశ్రాంతి న్నివేదింప; నే
నును నీతోనరుదెంతుఁదల్లిఁగని యన్యోన్యంబు ముద్దాడఁగన్;

ఉ. నాజనయిత్రి యెట్టిదో కన న్మదివుట్టెను, జన్మమాదిగా
నాజననీమతల్లి, ప్రణయాంకిత కోమలసుస్మితంబు ని
ర్వ్యాజకృపామహత్త్వము నిరంతదృగంచలశీతలత్వము
న్రాజిల నన్ను ముద్దిడియెనా యెపుడైన వచింపు నాయనా. 12

తే. గిరుల సెలయేళ్ళఁ దోఁగెడు తరుణములను
నందుఁ బ్రతిబింబితం బౌ మదాననంబుఁ
గాంచి యనుకొందు నాతల్లి యుంచుమోము
నైత మిటులుండునో యని సంతసమున; 13

తే. అంతలోననె వృద్ధుని యాస్యరంగ
మందు మృత్యువు తాండవ మాడఁదొడఁగె;
నెత్తలేక పక్ష్మలముల నెత్తి సూను
దరుణు నర్థగర్భిత దృగ్విధంబు దోఁప; 14

తే. కాంచు చుండఁగ మెలమెల్లఁ గన్నుదోయి
ముకుళితం బాయె రేఁదమ్మిపూవుపగిదిఁ;
బక్ష్మలంబులు జీవకవాటములును
నొక్కసారిగఁ బిహితమై యుండునేమొ ; 15

క. వీరుఁడు వృద్ధునిమరణము
నారసి లోలోన శోక మూఁపి, చెలియతోఁ
నోరాడక గద్గదగతి
నీరీతివచించె నేమి యెఱుఁగనియట్లున్; 16

చ. జనకుఁడు సొమ్మసిల్లి యిటు శయ్యపయిం జలనంబులేక నె
మ్మనమొకయింత శాంతిగనమాంద్యమునన్నిదురించువాఁడు నీ
వును శయనింపఁబొమ్ము; ఖగపుంజమునీడములందు రాత్రి నో
మెను సగమంచుఁ గూసెడిని; నేల హృదంతకచింతనల్ చెలీ;

క. తరుణుం డిట్లనియెఁ బల్కిన
దరళాయతనేత్ర యతిముదంబున శయ్యం
బొరసి వినిర్మలవదన
స్ఫురణ మ్మలకముల నింపుఁబూన శయించెన్; 18

ఉ. అంత ననంతచింతలకు నాలయమైన మనోంతరంబుఁ దా
నెంతయుఁ బూన్కితో ననునయించి దృగంచలబాష్పధార న
త్యంతమునాఁపికొంచుహృదయమ్మునఁజింతనసేయుఁగాంతుఁడా
చెంత శయించియున్న సరసీదళనేత్రను గాంచి ప్రీతిమై; 19

మ. సరసీలోలతరంగడోలల శరచ్చంద్రాంశుపూరంబు రా
ప్వరమంజిల్కఁగ బాలశైవలపు దీవల్ గ్రాలు నున్నాన్పునన్
నెరయం దూఁగు మరాళబాలికవలె న్నిర్మాయికాస్యంబుతో
హరిణీలోచన నిద్ర నోమెడిని నాహా! సుప్తిమే లెట్టిదో; 20

తే. మరణసౌఖ్యమ్ము రుచిచూప మానవులకు
నిన్ను సృజియించెనేమొ వనేజభవుఁడు;

కాకయున్న విశ్రాంతి యీలోకమునకు
నొక్కత్రుటియైన స్వప్నమా! దక్కఁగలదె; 21

తే. శోకసంతాపమున నార్త్మ సొమ్మసిల్లు
కష్టజీవికి నిశ్చింత గలుగఁ జేయ
స్వర్గనిశ్వాసమోహనపవనముల
నిద్దురా! వీచుచుందువు నిశలయందు; 22

తే. నీదుసంస్పర్శనంబున నిఖిలజగతి
యేకజీవసమాధిగ నెసఁగు చుండు;
గగనమం దుల్లసిల్లునక్షత్రగణము
పైని పెదచల్లు పువ్వులపగిదిఁ దోఁచు; 23

తే. కాలమునఁ దక్క మఱియేమికార్యమందు
మరణమునకును నీకు నంతరముగలదు?
స్వర్గసౌఖ్యమ్ము నిరయ సంసర్గబాధ
స్వప్నమా నీదుగర్భాన సంభవించు; 24

తే. ప్రణయ శేషుల మృత మిత్ర బాంధవులను
కౌఁగిలింపఁగ గల్గు నీకరుణకలిమి;
స్వర్గ మర్త్యలోకముల సంసర్గసూత్ర
మీవు స్వప్నమా! యేమని యే నుతింతు ; 25

తే. ప్రొద్దుపొడుపున వికసింపఁబోవుతమ్మి
పూవురీతిగ నిదురించుఁ బూవుఁబోఁణి;
తేఁకులెడలిన కంజకర్ణికవిధాన
సమసిపోయెడి వృద్ధుని సంహననము; 26

చ. ప్రకృతి నిశోదరంబున విరాజిలు శాంతత రూపుఁదాల్చె నీ
ముకుళితనేత్ర నా హృదుచమూరువుచర్మపుశయ్య, నా
ప్రకినలకోమలత్వమున మంజిమఁజిల్కు కపోలపాళులం
జికురములాక్రమింప సరసీరుహలోచన నిద్రవోయెడిన్; 27

మ. జనకుండేఁగె నిసర్గసిద్ధసరణిన్ స్వర్గంబు కాంతా, యటం
చును నేనెల్లునచింతు, నాత్మఁగొఱకచ్చున్ సూడిన శ్లాఁగదా;
జనకుండే జనయిత్రియట్టులఁ దమిన్ సాకంగఁ, గాంతారమే
తనలోకంబుగ నున్నముద్దియ మనస్తాపంబు నెట్లూడ్చెదన్;

ఉ. నాజనకుం డొనర్చిన యనర్థపుఁగల్మష మంతరింప నీ
రాజమనోహరాస్య కరిరాజసమంచితయాన ప్రేమకున్
భాజన మై ధరాభరణ భవ్యసుఖంబులనెల్ల నేఁడె సం
యోజనముంబొనర్తు వికచోత్పలనేత్ర పదాబ్జపీఠికిన్; 29

తే. ఇటులఁ దలపోయుచుండంగ నింతలోనఁ
గలవరించుచు మేల్కొనెఁ గలువకంటి;
చెలి యిదే మని పీరుండు పలుకరింప
నాకలోకముఁ గాంచితి నని వచించె; 30

క. అనవిని మనుజుల కయ్యది
గన నౌనే, స్వప్నమందుఁ గాంచినవిధమున్
వినిపింపుమనఁగఁ, గోమలి
యనియెను విస్మయరసంబు లలరఁగ నిటులన్; 31

క. పురుహూతచాపకాంతులు
విరివిగఁ దనులతలనుండి విరియుచునుండన్

సురలోకవాసు లానం
దరసవినిర్మగ్నులగుచుఁ దనరుదు రెప్పుడుఁ; 32

తే. కాంతియెల్లను నమృతసంకలిత మైన
జ్యోత్స్నయేగాని మఱియొంఁడు శోభలేదు;
దిక్కులెల్లను నీరంధ్ర తేజమొలుకఁ,
జంద్రబింబము గనరాదు చదలయందు; 33

తే. శబ్దమెల్లను వేణు నిష్పన్నమైన
మధురిమోద్గారి గానైకమంజిమంబె;
ప్రభవ మెద్దియొ గనుఁగొనఁ బడదుగాని
పరగు నక్షత్రగానరావములఁ గలసి; 34

తే. పవనగర్భంబునం దేలు ప్రసవరజము
లటులఁ బ్రేమ ప్రవాహమునందు జీవ
తతులు నీఁదుచు నుండు సుందరముగాఁగ;
నచట వైరస్యపాతక మభ్రసుమము; 35

తే. మారుతోద్ధూతజలధరమాలలటులఁ
బక్షములులేక పఱతురు వాయువీథి;
హృదయభావంబులెల్ల మూర్తీభవించి
యచటఁ బ్రత్యేకదృగ్విషయంబు లగును; 36

తే. హృదయపాత్రమునందు నా త్రిదివనిర్మ
లాంచితానందరసమును నించికొంటి;
నదియె యిప్పుడునైతము నాత్మయందుఁ
జంద్రికా శీతలామృతసరణి నొప్పు; 37

తే. జనకుఁడును నీవు నేను నాస్వర్గమందు
సర్వకాలము నానందసౌఖ్యములను
ననుభవింతముమిత్రమా యనఁగ యువతి,
గాంతుఁ డిట్లని వచియించెఁ గరుణ దొలఁక. 38

క. మనకన్నమున్నె జనకుఁడు
చనె సౌఖ్యములనుభవింప స్వర్గమ్మునకుఁ
మనమును గాలక్రమమున
వనితా పోఁగలము మృతికవాటము దెఱువన్. 39

---

# వ న కు మా రి

## ష ష్ఠ మ ం జ రి

---

క. కిలకిల పులుగులు తరుశా
ఖల రుతములొనర్చె వంచకంబులు కూఁతల్
గొలుపుటమాని గుహాంతర
ములఁదాఁగెను ; దూర్పుదిక్కు పొదలెఁ గాంతిన్ ; 1

తే. ఆయువనువైరి హరియించ ననుదినంబు
నుదయగిర్యగ్నినాళిక నుండి సూర్య
గోళమును బంపుచున్నాఁడో కాలుఁ డనఁగ
నలరెఁ దరుణార్కబింబ మత్యరుణకాంతి ; 2

తే. ప్రాఙ్నగంబను సగ్నిపర్వతము ప్రేలఁ
దరణి రుచియను మృత్తికాద్రవము రేఁగఁ
బరిసరనివాసులో యనఁ బక్షివితతి
గూయుచును నాల్గుదిక్కులఁ గూడఁబాఱె ; 3

తే. ఊర్ణనాభులతంతుసద్స్తోత్కరంబు
హిమకణావళిఁ జెలువొందెఁ, గమలమిత్రు
నకు నుషఃశ్రీసమర్పింప నవకమైన
క్రొత్తముత్తెపుఁబల్లెరం బెత్తె ననఁగ; 4

మ. కలహంసాంగన లంబుజోదర రణద్గర్వాంధభృంగాళిఁ జం
చులతో మీటిమృణాలనాళముల గచ్చునివ్వచ్చుగంద్రుంచుచున్
జలజాతాకరమందుఁ గ్రీడసలిపెం జంచద్గరుద్భిన్న ని
ర్మలవీచీమృదుడోలికాపరినట ద్రాజీనపత్రంబుగన్ ;

మ. అలకుంజాంతరపర్ణశయ్యలు కురంగానీకము ల్వీడి శృం
గలతాగ్రంబులఁగోకికొంచుఁదనుపుల్ కాంతారముంజొచ్చెడిన్
లలితగ్రాసకిసాలవర్షణ సముల్లాసక్రియాజాత గం
ధిలడిండీరకణచ్యుతి న్వనలతాదేశంబు లింపారఁగన్ ; 6

మ. ఘనకంఠమాతి దోలంగ భూమిరుహ సంఘాతప్రకాండంబులం
దనువు లొరియుచు నీలునుగ్ర గవయసంతానంబుఘాసంబులన్
వనపర్ణంబులుమేయ సానుతలము ల్వర్ధించి ఛాయాంతమో
జనితాభీలనిశాటవిం జనియెనుగ్ర సప్తాశ్వుఁ డేతేరఁగన్ ; 7

తే. రాత్రి నిద్రానిబద్ధ మహా ప్రకృతి యిపుడు
విమల కల్యానిలంబులు వీచు చుండఁ
దరుణ సూర్యాంశువులఁ బ్రబోధంబుఁబొంది
నిత్యకృత్యప్రవృత్త మై నెగడు చుండె ; 8

క. జనకునినిర్యాణంబును
మనమునఁ దలపోసి మాటిమాటికి శోక
మ్మునఁ గృశియించెడు కన్యకు
ననునయవాక్యములు పలుకు చట యువకుండున్ ; 9

ఉ. కొన్ని దినంబులంగడపి కోమలి యుమ్మలికమ్ముఁదీర్ప లో
కోన్నతవైభవంబు సరసోక్తుల బోధయొనర్చి, కొంత యా

పన్నతవాపి, యంతిపురిపై బలుకోరికె లుప్పతిల్లున
బ్లైన్నియొ వర్ణన ల్సలుపు నింతిమనంబు కరంగునట్లుగన్ ; 10

క. తరుణుఁడు వల్కోడు లౌకిక
సరణులు చిత్రములుగాఁగ సకిమదిఁదట్టఁ
విరచింపఁబడిన ఆాచి
త్తరువో యన నిశ్చలముగఁ దా విను చంతన్. 11

క. చిఱు తెమ్మెర కంసమ్ముల
నెఱకలు చెరలాడుచుండ నెలఁతుక యొటకోఁ
బరుఁగిడుచిత్తము చలన
స్ఫురణము లేకుండు నయనము ల్దగ నుండెన్ ; 12

చ. నెలఁది సమీపమందు నొక వేదికపైఁ బులితోలుపాన్పనం
జలితమనస్కుఁడై కడువిచారమునఁ యువకుండు వ్రాలి చిం
తలు బహిరంగరూపములఁ దాల్చినవోయనఁ గన్నుదమ్ములం
దొలఁకగ బాష్పధారలెదితోఁచకయూరకయుండెనయ్యెడన్;

మ. కలహంసీసమయాన కొంతవడి జాగ్రత్స్వప్నము న్వీడి ముం
గల వేదిఁ శయనించి యున్నతరుణుం గాంచున్విలోకించి తాఁ
బలికెఁ మిత్రుఁడ తల్లిదండ్రులు నను న్వర్జించి కాంతారసీ
మల నాకంబున కేఁగన్యాయమెభయోన్మాదంబు నన్నేఁచగన్.

మ. గిరులఁ గొఱ్ఱెలమేపఁబోవునెడలం గేలాన్చి చెక్కిళ్లపైఁ
గరుణావేల్లితబాష్పము ల్దొరఁగఁగం గౌఁగింట బంధించి ని
ర్భరవాత్సల్యముపొంగముద్దిడుచు నం బంపించుమాతండ్రియ
మ్మరో!యింకెవ్వరిముద్దుఁగొందుఁబ్రతిసమ్మానంబుఁగాంక్షించున్;

మ. గిరికూటంబుల సాంధ్యరాగరసముల్ క్రేవఁడిగంబాఱు ని
ర్ఝరపూరంబుల లీనమౌనపుడు నారాకం బ్రతీక్షించుచుఁ
సరణి న్వేచుచు సుండుఁదం డ్రి; యిఁకనఁ సంతోషమేపార నె
వ్వరు వీక్షించెదువారులేరొ పితతోఁ బాడాయెనేప్రేమయున్.

చ. అనవిని వీరుఁడంతఁ జెలియంగని యిట్లను గాంతయేల నె
మ్మనమునఁ జింతవోవ వినుమా నచియించెద నొక్కమాట నీ
జనకునికన్న మిన్నయగుచాడ్పున సం దలపోయు మేను ని
న్ననయము మద్గృదబ్జసదనాంతరవాసినిగాఁగ నెంచెదన్;

తే. ఆలవాలంబునం బుట్టి యుండె పెరిఁగి
పూవుఁగొమ్మలఁ బొదలెడు పుష్పవల్లి
ప్రక్క విలసిల్లుతరువునఁ బ్రాఁకకున్నె;
లతలుఁ గాంతలు నాశ్రయోల్లసిత లెపుడు: 18

చ. అనపుడు వీరుఁ డంగనయు నాతనిగాంచి ప్రమోదబాష్ప మై
యను, సరవాసయోగ్యమగు నానవలోకము నన్నుఁజేర్చె దే;
కనుఁగొనవచ్చునే యచటఁ గానలనున్నమనోజ్ఞవస్తువుల్;
ఇనుఁ డవనీధరాగ్రముల నెఱ్ఱనిరంగులఁ గ్రుంకుచుండునే; 19

చ. గొఱియలమేఁతకుఁ గిరులు కోమలఘాస లతానికుంజ ని
ర్ఝరకలితంబులై యచట రాజిలునే; హరిణీకుమారికో
త్కరములు నిర్భయాత్మలయి కానఁగనౌనె తృణాంకితావనిన్;
సరసకలాస్ఫుటారవము సల్పు పికాంగన లున్నె మావులన్ 20

తే. ప్రసవకిమ్మీరములుగాఁగఁ బరగులతలు
చెట్టుగొమ్మల మేల్కట్లు గట్టినటుల

నీలనీరదమాలల నెగడుచున్న
యింద్రచాపంబు స్వార్గికసాంద్రకాంతి ; 21

మ. అని యీరీతిగఁ గన్య పల్కఁ విని నెయ్యం బాత్మఁ దోఁపంగ ని
ట్లనియెన్వీరుఁడు, నీప్రదేశము ప్రపంచాశంబె యేకాంతశ్ గిరుల్
వనముల్ సూర్యుఁడుచంద్రుఁడుంగలరిఁకేలాతర్కమందెన్ని యేఁ
ఘనసౌధంబులుసౌఖ్యసంపదలుకాంతా,గల్గు నశాంతముల్ ;

శా. నాతో నీ వరుదెంచినం గమలినీనాళంబుఖండంబులన్
మేఁతల్మేయు మరాళబాలికలు నున్మీలత్సరోజంబులుం
జేతోమోదము గూర్చుపుష్కరిణులుంజిత్రాలయంబుల్ చెలీ,
ప్రీతింగాంచెదవందుఁ బుష్పితలతోపేతామ్రకుంజంబులున్ ;

సీ. నవరత్నఖచిత సుందర హార భూషలు
ధరియింపఁగలవు చిత్తంబు బడిని;
చంద్రశిలా రమ్యసౌధభూమికలందు
వెన్నెల విహరింతు వేడ్కఁ గొలఁది;
జాళువాబంగారు జరియంచు మేల్పట్టు
పుట్టము ల్గల వందుఁ బూవుఁబోఁడి ;
యీవాజ్ఞవెట్టిన నెఱిఁగివర్తింతురు
శుద్ధాంతకాంత లుత్సుకత దోఁపఁ ;

తే. దరుణి త్రుటిలోన నీ జీవితంబు మాఱి
సకలసామ్రాజ్యభూర్వహశ్లాఘితేంద్రు
పట్టమహిషివి యవుదువు; వనకుటీర
తలమున వసింప నేల కాంతారభూమి ; 24

ఉ. నావుడు, కన్యకామణి మనంబున నించుక చింతచేసి నే
నీ వనసీమఁ బాసి యిపు డెమ్మెయి రాఁగల, జన్మమాదిగా
నీవిధిఁ బర్ణశాల వసియించుచు గొఱ్ఱెలమేపికొంచు నిం
దే విహరించుచుందు గిరులెంతయునాకుఁ బ్రియంబుగూర్పఁగన్

తే. జనకపదపాంసుపటలిఁ బావనములైన
కాననోర్వుల విడనోప గడియన్మైన;
హార్మ్యమందు శోకమ్మున నడలుకంటె
శాంతిఁబాయక కాననస్థలమె మేలు; 26

తే. వల్లికాగర్భిణులు సుమప్రసవ మగు వ
సంతఋతువు సమీపించుసమయ మయ్యె;
మాధవీమంటపంబుల మల్లికాని
కుంజములఁ బుత్తు దినములు గోర్కెకొలఁది; 27

క. అన విని చిత్తంబున మే
కు నెరిమినయటులఁ గలంగి కోమలిఁ గని యి
ట్లనియెను గాంతుఁడు కరుణా
జనకసుధారసమయోక్తి చాతురి మెఱయన్; 28

చ. తెలియకయంటివేమొ పొలఁతీ, జగతి న్జనియించువెల్ల ని
శ్చలబహుభోగభాగ్యములు సమ్మతినై భుజియింపనేగదా;
లలితసుమంబు కాననతలంబునఁ బుట్టి జనోపభోగ్యమై
వెలయక వాడునట్టు లడవిం గృశియింపఁదలంపఁ బాడియే?

చ. మనదగుజీవితంబు, ఘనమార్గమునన్ దిగజాఱి దిక్కులె
ల్లను నిజకాంతి హేమరుచుల న్వెలిఁగించి క్షణంబులోపలన్

మనిఁగెడుతోఁకచుక్కయనుమాటయసత్యముగాదు, కావునం
దనువునఁ బ్రాణముండఁగనెతన్విరో, సౌఖ్యములంద మేలగున్;

క. అనవుడు, యోజనమెయి న
వ్వనితయు మృదుమధురసరణి వాకొనె నిటు, లీ
వనుల వసించియు మిత్రుఁడ,
గనకుందుమె యట్టి సౌఖ్యగతుల ముదానన్; 31

చ. అకలుష నిర్ఝరీజలరసాయనముల్, కిసలోజ్జ్వలల్లతా
ప్రకరములుం దృణోత్కరములును బాపి కురంగకుమారి హేమర
త్నకలితపంజరాంతరమున న్నివసింపఁగఁ జేయురీతిఁ గొం
కక యవరోధసౌధమునఁ గట్టగ నెంచితె నన్ను నిచ్చలున్;

ఉ. అప్పుడ విచ్చి తావులను నల్లనఁ జల్లుసరోజషండముం
గుప్పునఁ జేరి షట్పదము గ్రోలుమరందము; కృత్రిమంబుగా
నొప్పెడుపూవమూల్యమయియుండియునేమిగ్రహింపనందులం
జొప్పడునే మధువ్రతము చూడులుగొట్టెడు కమ్మఁదేనియల్;

ఉ. పుట్టిననాఁటఁగోలెఁ దరుపూగమునీడలు విశ్రమింపఁగం
గొట్టములై చెలంగ వని గొత్తెలమేపులెవృత్తిగా, రసం
బుట్టగ వేణుగానముల నోపినయట్టులఁ బాడికొంచు నా
యట్టికుమారి నేన యని యాడుచు నుందుఁ బ్రభాతవేళలన్;

తే. శ్యామలోర్వీధరంబుల సాంధ్యవేళ
జలధరాచ్ఛాదములపైకి సలమికొనెడు
కలిత కిమ్మీరవర్ణంపుఁగాంతులకును
సకలసామ్రాజ్య సౌఖ్యంబు సాటియగునె; 35

తే. సరసి మృదుపంకలగ్న మై తరఁగలందుఁ
బ్రాకిఁ జెరలాడు కమలినీనాళ మేల
పెకికి నాఁటెదు మోహానఁ బెరటియందుఁ
జావ కయ్యది బ్రతుకునే సదమలాత్మ ; 36

క. నను నొంప నీయభీష్టం
బని తలఁచెద వేని నేఁడె యానరవాసం
బునకు ననుం గొనిపొమ్మా
యన నచ్చెలి, కాంతుఁ డనియె నాశ్చర్యమునన్ ; 37

ఉ. ప్రాణసమాన, నీదయిసభావము నే నెఱుఁగంగఁజాలమిం
బోణిమిదక్కి పక్కితిని, భూరిసుఖంబులు రాజ్య మేని త్వత్
ప్రాణసురక్షణార్థమయి వాయుదు; నీ కొకకీడు సల్ప హృ
త్కోణమునం దలంచెద నె? క్రూరుఁడనే యిటుకష్ట పెట్టఁగన్ ;

మ. అదియేమోనినుగాంచనాదుహృదయం బత్యంతరాగాంకురా
స్పద మై, పూర్వముచెల్మియున్నటులఁ జెప్పన్రానియిచ్ఛాలతల్
మదిలో నల్లడ నల్లువాఱె; నిఁక నిర్మానుష్యమహాకాన నో
సుదతీ, యొంటిగ నిన్ను వీడి చని యేచ్చోనైన జీవింతునే; 39

చ. అన విని కోమలాంగి హృదయాంతర రాగరస ప్రవాహ వీ
చి నిబిడ శీకర ప్రతతి చిప్పిలెనో కనుదమ్ములందునాఁ
దొనికెడు సమ్మదాశ్రువులు దూలఁగఁ జా నరచేత నద్ది యి
ట్లనియెను గద్గదాస్ఫుటము లై పదముల్ పవనానయాపర్ణ;

మ. ఖగముల్ నీడములందు జంటలుగ నెక్కాలంబు వాసించునిం
పుగ, నట్లే మనముంద మీసుమలతాపుంజాలయంబు ల్వనిన్

సొగసు లీనఁగ విశ్రమస్థలములై, ఝుమ్మంచు నిత్యమ్ముఁగూల గతాంశ్మంబుల జాటి నిర్ఝరము లాలాపింప రాగంబులన్;41

మ. హరినీలంబుల హీరము ల్పొదివిన ట్లాకాశ దేశంబు భా
స్వరనక్షత్రముల న్వెలుంగఁగ శరచ్చంద్రుండు దూఁగాడుకం
ధరపర్యంకము డిగ్గు చుండ, మది నెన్నన్రానిమోదంబునన్
సరసీసైకతసీమలందు మును సంచారంబుగావించితిన్. 42

క. పవమానచలిత పత్రా
రవములు సెలయేళ్ల గానరావముదక్కం
బ్రవిమల రజనీశాంతత
కు విభంగములేదు సరసికూలములందున్ ; 43

సీ. ఆనందపరవశ నైన నాగానంబు
పవనకంపిత పర్ణరవము నందు,
నున్నట్టు లుండె చె న్నొలయంగ సెలవులఁ
దులకించు నవ్వు వెన్నెలలయందు,
నిశ్చలజ్యోతి యై నిర్మలంబైన చి
త్తము నిశాగర్భ శాంతత్వమందు,
మైమఱచినటించు మంజుల క్రీడలు
సరసీతరంగలాస్యములయందు

తే. నైక్యమైపోయి మద్వ్యక్తి యంతరించి
యఖిలవస్తుచయాంతస్థ మైన యాత్మ
యటుల, సర్వంబు నేన నై యకలుషంపు
నిర్భరానందమున నుంటి నిశలయందు; 44

శా. నీ విచ్చో నివసింప నిష్టపడిన న్నిత్యమ్ముఁ దత్ప్రాంతసే
వావిద్యోతితమానసాంబుజులమై ప్రాభాత నీరేజషం
డావిర్భూత సుగంధగంధిలతుషారార్ద్రానిలాంకూరముల్
వీవంగ న్విహరించుచుండెదము సంప్రీతిం బిసాళించుచున్; 45

చ. జనకునియట్టు లంత్యమున సర్వమువీడి ధరాతలంబునన్
మనవగుపేరు లెవ్వరు మనంబున నెంచనరీతిఁ గాలవీ
ధిని జరితాంఘ్రిచిహ్నములు తేరనియట్టుల మృత్యుసూత్రలం
బనమునఁ బ్రాఁకిపోయెదము స్వర్గము సేరఁగ నోయిమిత్రమా;

క. అనవుడు, పలుకక కాంతుఁడు
వనితకుఁ బ్రత్యుత్తరంబు వచియించుటకున్
మనమునఁ దోఁపక మీసము
మొన దువ్వుచుఁ గ్రిందిచూపు మొనయఁగ నుండెన్; 47

క. తరుణియు జనకుని నామ
స్మరణమ్మున నూత్నచింత మదినెరియఁగఁ, దొం
తరలుగఁ గన్నుల బాష్పము
లురలఁగఁ బయ్యెదను ఱెప్ప లొత్తుచునుండెన్; 48

---

# వనకుమారి

## సప్తమ మంజరి

క. ఇరువురు కొన్నినిమేషము
లరిగినఁ గుటివేదినుండి యవలికిఁ జని ప
య్యరలకుఁ బువ్వులురాలెడు
తరుపుంజమునీడ సూర్యతాపము వాపన్; 1

తే. తరుణ మరకతచూర్ణంబు పఱచినటుల
లేఁతపచ్చిక విలసిల్లి ప్రీతిఁగొలుపు
చల్లపట్టునఁ గూర్చుండి, సంతసమున
రమణుఁ డిటువల్కెఁ బ్రణయసౌరభ్యమొలుక; 2

మ. అళిపక్షాహతి ఝొక్కఁ గోవని మనోజ్ఞాంభోజ లావణ్యముం
దొలఁకం జేసెడు నీదు ముద్దుమొగముం దోరంబువీక్షింప నో
లలితాంగీ, ప్రణయార్ద్రి మాచు రసవాల్లభ్యంబునం బొంగుని
చ్చలునాచిత్తము; పూర్వజన్మఫలముల్ సంబంధబాంధవ్యముల్.

తే. నిశఁ దమంబు లడంచ వెన్నెలలకందు
గున్నపొదరిల్లు వలపింపఁ గొమరు కుసుమ
మటులఁ బురుషునిజీవితం బలరఁ జేయ
స్త్రీల నిర్మించెను విరించి సృష్టియందు; 4

మ. మనుజుండేమయి యెట్లుపోవునొగదా మూర్ఖధుర్యాత్ముఁడై
చను కాంతామణులుండకుండిన నిలన్, సద్భావము ల్మాని దు
ర్జనుఁడై ఘాతుకసత్త్వమట్టుల నహోరాత్రంబులుం గ్రూరవ
ర్తనమే వృత్తిగఁ గర్కశాత్ముఁడయి నిందంబొందు నేమో చెలీ;

క. ప్రేమకుఁ గేంద్రస్థానము
లై మెలఁతలు కటికవానియాత్మను నైనం
గోమల కరుణాంకుర
స్తోమము పుట్టింపఁగలరు శుభదృష్టులచేన్; 6

క. సలిల ప్రవాహ వీచీ
చలితంబు తృణద్వయంబుచాడ్పున మనమో
చెలియా, దైవప్రేరణఁ
గలసితి మీవనులఁ; గౌతుకంబగు నిదియున్; 7

ఉ. కాని మఱొక్కమాట, నినుఁ గాంచినదాదిగ వీడిపోవఁగన్
మానసమొప్పదేమొ; వని మా పరివారము నన్నుఁ గానకే,
నే నెటకేఁగితో యని యనిశ్చితబుద్ధిఁ జరించుచుండునో
మానిని, చూచివత్తు, ననుమానము చిత్తముఁ దీవరించెడిన్;

క. అనవుడు కన్యక విస్మయ
మున నిట్టులఁ బల్కె, నేమి మును నొక్కఁడవే
వని కరుదెంచితివని నే
ననుకొందును శ్రేయసుఁడ, యథార్థముఁ జెపుమా; 9

ఉ. నావిని కాంతుఁ డిట్లనియె నాతిరో, నే మృగయావినోదచిం
తావివశుండనై వనుల దవ్వుల బోయల నిల్పి యొంటిగన్

ద్రోవనుబట్టిపోవ నెటనో సరిమార్గముఁ దప్పి చీఁకటిన్
గా వని నిన్నుఁ గంటినిధరాధరపార్శ్వముఁ జేరుచుండఁగన్;

క. ఇఁకఁ గొంతసేపు కానన
నికటతలంబులను వెదకి నే మృగయుల నూ
రికిఁ బంపించి యమాత్యున
కొకవార్తను బుచ్చి వత్తు నుత్పలనేత్రా; 11

చ. అన విని సమ్మతింపఁ దరళాక్షియుఁ, గాంతుఁడు లోనిప్రేమగు
ప్పున నెగఁదట్టెనో యనఁగఁ బొల్పగునెచ్చెలి యోష్ఠపల్లవం
బునకు నిజోష్ఠముం గదిపి, మున్నడి బాహులఁ జాపి కౌఁగిటం
గొని ఘనసాత్వికోచ్ఛ్వసితఁ గోమలి నుల్లము పల్లవింపఁగన్;

తే. ఎంతసేపిట్టు లుండిరో యెఱుకపడక
యిరువు రన్యోన్య నిశ్వాసపరిమళంబు
లాను చానందపారవశ్యమున నుండఁ
దనకు దానుగ బాహుబంధంబు సడలె; 13

ఉ. మారుతచాలితం బయిన మంజులవల్లిక యో యనంగ శృం
గారశరీర కొంతవడి కంపిలి యర్ధనిమీలితాక్షులం
గూరినమాంద్యముం దొలఁగి కుంతలముల్ సరియొత్తికొంచునా
వీరునితోడ నిట్లనియె "వే యరుదెంతువె సంజకీవలన్." 14

క. వీరుం డటువలెకా కని
సారసలోచనను వీడి చనుదెంచుచుఁ బ
ల్మాఱును వెనుకకు ముందుకుఁ
దారుచుఁ గనుచూపు దాఁటెఁ దద్వనసీమన్; 15

చ. యువతియుఁ జెట్టునీడఁ గుసుమోజ్జ్వలహాసెలగొమ్మఁ బాణిప
ల్లవమునఁ బట్టి నెన్నుదుట లాస్యములాడు శిరోజమాలికం
జెవులకునెట్టి, ఫ్రూరసముఁ జిల్కుసమీరము వెంటనంటు భృం
గవిసరమట్టులం బ్రియుని గాంచఁగ నేఁగు నిరీక్షణావళిన్, 16

చ. వెనుక మరల్పలేక పలవించుచు నెట్టకునేని లోనికిం
జనఁ దమకించెఁ గాని తనస్వాంతము కాంతునియందు లీనమై
తనరుట నెట్లుచూచినను దన్వికి నూతనినుస్వరూపమే
కనఁబడుగా; వియోగమునఁ గాంక్షయుఁ బ్రేమయుమల్లడింపవే;

చ. తటుకున నిల్లుసొచ్చి క్షుభితాంబగుచి త్తమునన్ మరాళసం
త్రుటితమృణాళమట్లు వసిమాలినయంగముతోడ వేదిపైఁ
· గుటిలశిరోజ పంసుకొని కోర్కెలు క్రేళ్లుఱుకన్ భవిష్యద
స్ఫుటనిజదిష్ట మాత్మఁ దలపోయుచు నుండెఁ ద దేకచి త్తయై;

చ. తరుణుఁడు నన్ను రమ్మని ముదమ్మునఁబిల్చుచునున్న వాఁడు,భూ
ధరములఁ గానలన్ గొత్తైలతండము మేపుటమాని సౌధమం
దిరముల నేవొ రత్నరమణీయవిభూషలు జిల్గుపట్టు టం
బరములుఁదాల్చియుంటయనుభాన్యసుఖంబటయాస్థలంబునన్;

తే. శబలితంబైన పురుహూతచాప మంత
రాళమునఁ గాంతి విలసిల్లువేళ, లేఁత
పచ్చికబయళ్ల మిన్నులుపడ్డయెడకుఁ
బరువిడఁగనీయరఁట యంతిపురిజనంబు; 20

క. అని తలపోయుచు ని ట్లా
వనితామణి పవనచలిత పర్ణరవంబుల్

వినఁబడ, వచ్చెను నాప్రియుఁ
డని చూచుచునుండుఁ దమిని ద్వారమువంకన్; 21

చ. నవకపు సాంధ్యరాగకిరణంబులు చూరులనల్లువాఱి లోఁ
దవిలి కుటీరకుడ్యములఁ దామ్రసుమావళి జాలెగట్టి నిం
తవఱకు దేల రాఁడొ, వనిఁ దప్పెనొ మార్గము కాంతుఁడంచు నా
యువతి విదీర్ణభావ యయి యుండఁ దమిస్రమునిండె నల్గడన్;

తే. పూవుఁబొదరింట నిండారఁబూచి క్రొత్త
పరిమళంబులు వెదచల్లు ప్రసవ మొంపు
గాలితాఁకున ముండ్లలోఁ దూలినటుల
నతివహృదయంబు శోకసంపతిత మయ్యె; 23

చ. జనకుఁడు లేఁడు, కాంతుఁడును సంజకు రాఁడు, తమోవితానముల్
దనరెను దిక్కులందు, మదిఁ దాపము వోదు, కుటీరమందు నెం
దునెగడు శాంతికిం బొలఁతి దుఃఖరవంబె విభంగహేతు; వ
వ్వని నిశ నొంటిగా నెటుల వాసము సేయును గాంత చింతతోన్;

తే. కిసలయాచ్ఛాదనాంతస్థ కుసుమకళిక
యనిలసంహతి దినకాంతిఁ గనినరీతి
హృత్ప్రపంచవై శాల్య మయ్యెంతి కనులఁ
గట్టె మోహముతీయ పూర్వస్మృతింపుఁ దెఱను; 25

చ. ఇదివఱకెల్ల వేళల మృగేక్షణ మోహునునంటియుంటఁ దా
నెదఁ దలపోయదయ్యెఁ బితయేఁగినలోపము; నిప్పుడన్న నో
పొదలెడిభీతిమైఁ దనదు పూర్వచరిత్రము సంస్మరించి యా
పదలను జిక్కికొంటినని పల్కుచు నుమ్మలికంబునొందెడిన్; 26

మ. చెలియమనంబు పూర్వమటు చెన్నలరారుటలేక ఘూర్ణ నా
కుల బహువిభ్రమాశయతఁ గుందుచునుండెనిరంతచింతలన్;
లలితసుమాంగి, లోకకుహనాగతుల న్మతిలేనిముగ్ధ, య
క్కలికి హాహా న్మనోవ్యథల గారియకున్ సహింపఁజాలునే;

తే. హేతువిజ్ఞానపతిత మా నాతిమనము
ప్రతినిమేషముఁ జిత్రించుఁ బ్రచురవివిధ
భీకరాకారిముల భావవిగ్రహములఁ
బర్ణమర్మర నిస్వాన వర్ణయుక్తి; 28

మ. అరరే! జీవితచిత్రవైఖరి, త్రుటిన్ హర్షంబు శోకంబుగం
బరగున్ శోకము హర్షమట్లు; సుమనోవల్లీమనోజ్ఞాంగి సుం
దర పద్మాయతనేత్ర, నీలకచ, విన్నాణంపుబింబోష్ఠి, య
ద్దిర! యున్మాదినినా వికీర్ణకచ యై దీనాస్య యై చూపడున్; 29

తే. నిదుర పట్టియుఁ బట్టక సుదతి కపుడు
చిత్రచిత్రాకృతులు స్వప్నసీమఁ దోఁప
నుల్కిపడి లేచి యొంటరి తా నుంట యెఱిఁగి
గాలిగర్భాన నేడ్పులు గరఁగఁ బొగిలె; 30

చ. కడకెటులో ప్రభాతరమ కాంతనెగుల్గనలేక శాంతముం
గుడుపఁగ వచ్చుచున్నదని కూరిమిఁ దెల్పు సఖీజనంబునా
వడి నరుణాంశుమాలికలు పర్ణగృహంబు నలంకరింప న
ప్పడతుక మేలుకాంచి కుటిపార్శ్వవనాంతరము ల్చొరంబడెన్;

తే. మారుతోద్ధూతమై నభోమార్గమందు
సుడియు శుష్కచ్ఛదంబునా సుందరాంగి

యోఁగుచుండె గమ్యస్థలస్మృతియలేక
దైవ మీడ్చెడు కాననస్థలుల కెల్ల; 32

శా. కాలుల్ బొబ్బలు కంటకంబులుతృణాగ్రంబుల్ పదాబ్జంబులన్
డీలంజేయ, నహస్కరుండు నడిమింటింజేరి తీండ్రింపఁగం
గాలుంబెట్టఁగలేక, కాంతుకయి యిక్కట్లొయుకోర్కింబలెన్
రోలంబాలక చెట్టునీడఁ బడి యాక్రోశించుఁ బేరెల్గునన్; 33

ఉ. కాంతుఁడ యెట్లుపోయితివి కానల నవ్విడనాడి, సంజ కీ
ప్రాంతము చేరవత్తునని పల్కియుఁ బ్రేమరసార్ద్రచిత్త ని
క్లాంతయుఁ గష్టపెట్ట మది యెట్లుసహించె; శిరీషపేశల
స్వాంతులు నిట్టివంత గుసుపం దలపెట్టుట పాడియేయొరుల్ ;

చ. విరహ మనార్తిదాయకము వీడక నిందలపోయుట న్మనో
హరుఁడు, కఠోరకంటకసమాకులమైన గులాబిపూఁబొదం
జొరఁబడి మంచుతుంపరలు జొబ్బిలు పుష్పముఁగాంచురీతి;ప్రే
మరసనిషేవణాత్మకుల మానసము ల్మధురంబులెయ్యెడన్; 35

క. జనకుని నిర్యాణంబును
నినుఁగాంచుటయుం దలంప నిదుర నెవేవో
గనఁబడుచు మాయమయ్యెను
మనోహర విచిత్రపాళిమాడ్కిం దనరున్ ; 36

చ. తెలియఁగనైతి మద్హృదయదేశమునం దిటువంటి వింత శ
క్తులుజనియించునంచుఁ గొలఁదుల్గనఁజాలకయుంటినే మొపూఁ
గలికయు భావివిస్ఫుటవికస్వరతం గని సౌరభంబు ని
చ్చలుఁ జిలికింతునంచెఱుఁగఁజాలునెచైత్రము డాయునంతకున్;

చ. అని యిటు చింతచేసి; చెలి యంతటఁ గాంతుఁడు పర్ణశాలకుం
జని తను వేచుచుండునని చయ్యనలేచి కుటీరసీమకుం
జను; నట నెవ్వరు న్మెదలుశబ్దము గానక నిష్ఫలాశ నై
గొనుఁగుచుఁ బోవుచుండు నెటకో పటుశోకవిపాటితాత్మ యై;

సీ. ఒకనాఁడు గిరికూట నికట గహ్వరముల
లోనుభాగంబులఁ జక్కఁ జూచు;
నొకనాఁడు ఘనతాయక కాననముఁ జేరి
త్రొక్కనిదారులు త్రొక్కి వెదకు;
నొకనాఁడు నిర్ఝరీ సికతాతలంబుల
కేఁగి పాదాంక పరీక్ష సేయు;
నొకనాఁడు విభ్రమాచకితమనస్క యై
తిరిగినయెడ లెల్ల మరలఁ దిరుగుఁ;

తే. దల్లిఁ బాసిన లేఁజింకపిల్లయటులఁ
దాను మెట్టని కానస్థలములేదు
నాఁగ వెదకియుఁ బ్రియుని గనంగలేక
ఖిన్నమానస యై యేడ్చు మిన్నుఁ గనుచు; 39

క. దినదిన మిట్టులఁ గాంతా
రనగముల న్వెదకి వెదకి రాత్రియుఁ బవలుం
మనముఁ గలంచెడు చింతా
ఘనశల్యమునం దొలంగెఁ గలికి బెడంగుల్; 40

తే. నీరు నన్నంబు విడనాడి నిదుర మాని
విరహశోషితచిత్త యై సరసిజాక్షి

చేతనాచేతనజ్ఞానసిద్ధిఁ దొలఁగి
వలుకసాఁగె మనోవ్యథ పక్షులకును; 41

చ. కలరవ కోమలం బగు వికస్వర సుస్వరమెత్తి నీహృదిం
గల సరసానురాగ మెసకమ్ముగఁ బాడెద, విట్టివిద్య నెం
దులమునునభ్యసించితివి, దుఃఖనిమగ్ననుఁ జేయు ప్రేయసుం
డలవడఁడేమొ నీకును బికాంగన, పల్కుమ ముద్దుగుల్కఁగన్;

శా. నీసంతోషమునన్ శతాంశమయిన న్నిత్యమ్ముశిక్షించు మో
వాసంతంబ, మనోవిషాదపథము ల్వర్జించి నక్షత్రవీ
ణాసంబద్ధ మదీయగానరవసంతానంబు నీగీతలన్
వాసి న్నేళముచేసి యీవనముల న్వాసింతు సఖ్యమ్ముగన్; 43

చ. అనిలహతిం జలించి యనయంబును డోలికయట్లు లూఁగుకొ
మ్మను బసికందునుంచి మృదుమంజులగానముసేయు శారికా,
నను విధి నీదుగర్భమున నాఁడె జనింపఁగఁజేసియున్న మో
హన వనవీథులం దెగురులాడుచు నుందునుగాదె మీవలెన్;

ఉ. నిర్మలనిర్ఝరంబ, రమణీయకలాస్ఫుట గాన నిస్వనం
బర్మిలిఁజేయుచున్ గిరితటాగ్రములం బ్రవహించుచుందు, వా
మర్మముసెప్పి నీయుదరమధ్యమున న్నను జేర్చికొమ్ము త్వ
చ్ఛర్మద గర్భశీతలత సంతత శాంతికరంబ యాత్మకున్; 45

చ. అనుచు విషాదచిత్తయయి యా కుసుమాంగి నిషాదబాణసం
జనితనితాంతబాధఁ బెలుచం బతితంబగు హంసమట్లుఁ దాఁ
జని నెటిపూపుటోవరి విశాల తృణాంకురశయ్యపై శయిం
చెను నిజజీవితాభ్రమునఁ జెన్నుఱెనో కడసారి తారనాన్; 46

చ. కొఱలు బహిఃప్రపంచమునకుం దనకుం దెరచీరగాఁగ బం
ధురసుమము ల్సమీరహతిఁ దూర్ణము రాల, వికాసపుంజమై
పొరసెనుగాంతి, శాపమునఁ బుష్పసమాధి నిలీనయైన య
చ్చరపువ్వుఁబోఁడివోలె విలస చ్చటులాలక గుప్తవక్త్రయై ;

---

# వ న కు మా రి

## అ ష్ట మ మం జ రి

క. వేటాడుచు మృగయులు ఘో
రాటవి నరపతిని గాన కడలుచు నాయా
చోటులు లోయలు భూభృ
త్కూటంబులు వెదకి జాడ గూడక యున్నన్; 1

తే. వేటతమకమ్మున న్రాజు వీడి మనల
వనులలోఁ గ్రూరమృగములవాతఁ బడెనొ,
గాకయుండిన నెందేనిఁ గానరాఁడె
యనుచుఁ బలవించి పరివార మేఁగెఁ బురికి; 2

తే. నృపకుమారుండు మృగయుల విపినమందు
వెదకివెదకియుఁ గనలేక విసుగుఁబొంది,
పర్ణశాలకు మరలుచుఁ బథము దప్పి
క్రుమ్మరుచు రాత్రిఁ బుచ్చె నా కుధరములనె; 3

చ. చని సరిదారి గాంచి విలస త్తరుణార్క మయూఖమాలికా
జనిత సువర్ణకాంతుల పసల్ కిసలంబులఁ బ్రోదిసేయుచోఁ
గనె ఖగవర్జితం బగు వికాస విహీన కులాయమట్టులం
దనరుకుటీరసీమ నతిదారుణ శోకపరీతచిత్తుఁ డై; 4

క. ఇంతకుము న్నె ప్రేయసి
కాంతుఁడు రాఁడనుచు నిబిడకాంతారములం
జింతయొయి వెదకఁబోవుట
నింతిని గనఁడయ్యె ధారుణీశసుతుండున్ ; 5

చ. కనక యిదేమి కాంత యిటుఁ గానఁగరాదు, ప్రదోషవేళఁదాఁ
కను నను వేచి, దుష్కపటిఁగాఁ దలపోసి, హతాశ యై కడు
న్వనరి ప్రపంచజీవనము వాయుటె శాంతికరం బటంచు నే
వనతరువాటికాలతలబంధములం ద్యజియించెనో యొయిన్ ;

చ. అటునిటుపాఱఁజూచుఁ, జెలియా, చెలియా, యను, జెట్లనీడలం
జటుల లతానికుంజములచక్కని గాంచు, విషాదబాష్పముల్
తటుకునరా నడంచు, విదితంబుగఁ జేతులు దట్టు, పేరుఁ డు
త్కటరవ మేర్పడం బిలుచుఁ గాంతఁ గనుంగొనలేక దీనుఁడై ;

తే. వెలఁదియును దాఁ బరస్పరాన్వేషణంబు
సేయుచును దుర్గమారణ్యసీను నొకరి
కొకరు వోయినమార్గమ్ము గానరుపడక
తిరుగుచుండిరి వెతఁ గొన్ని దినము లిటుల ; 8

సీ. కుసుమాపచయమునకుఁ దరలెనో యని
నవలతాపుంజంబుఁ దవిలి చనును ;
నటలేకయున్న మిక్కుటమగు చింతతో
మరలి, నీరాడఁబోవు రమణియని
నిర్మల నిర్ఝరీ నికట సైకతముల
కేఁగి వీక్షించు, నం దెందులేక

అట డ

యున్నఁ బేరెల్గున నోకాంత నను వంత
వెట్టంగనే లని విసిగి పలుకుఁ
తే. దరుణుఁ డేమన్నఁ దన ప్రతిధ్వనియెగాని
యువతి ప్రత్యుత్తరంబు రాకుంట యెఱిఁగి
యచట బాటల నూత్న పాదాబ్జచిహ్న
లొనరఁ దన్మార్గమును బట్టి చనుచునుండె; 9

చ. చనిచని యొక్కచో, వికచసారసషండమునందు సుప్తిమైఁ
గనుఁగవమోడ్చుహంసివలెఁ గాంతిలునో గ్రుకఁబుష్పపుంజమం
దు నిదుర వోవు నిర్జరవధూమణిఁబోలినదానిఁ దీవటిం
టను బడియున్నదాని నికటంబునఁ గాంచెఁ దృణంపుశయ్యపై;

ఉ. కాంచి దృగంచలంబులనె కాంచనగాత్రిని మ్రింగునట్లు కుం
జాంచలవీథిఁ జేరి హృదయప్రతిబింబసమాన యిద్ది, నా
చంచలనేత్ర యం చని విషాదము విస్మయమంత మోదముం
గొంచక చిత్తముం గలఁప గుండెదడాబడఁ గొట్టుచుండఁగన్;

ఉ. ఏమని యెంతు నాసుకృత మీఁగతిముత్ప్రితిపాదియయ్యెఁ,గాం
తామణిఁ గాన నో యని వెత న్నశియించెడునాకుఁ బేద కు
ద్ధామ ధనంబునా దొరకె, ధన్యుఁడ నైతి,నటంచుఁ గోమలిన్
శ్యామల పత్ర పుష్పనిచయంబులనుండి తెరల్చె మీఁదికిన్;

చ. కమలినపద్మనాళమటు కాంతి దొఱంగిన దేహవల్లి న
శ్రమముగ నెత్తుచుండఁ బయి వ్రాలెను దూలికవిగ్రహంబునా;
విమల విలోలనేత్రములు వే ముకుళించిన తమ్ములట్లు మం
ద్మరమఁ బాసి వ్యాపనముచేసెను సుందరతాప్రదోషమున్;

మ. చెలి యంసంబుల నల్లప ట్టటుల నిస్సీమంపుఁగాంతిఁ, మరు
చ్చలితం బై పరికీర్ణ మౌ నెఱికలన్ సంధించి బంధించి ఘ
ర్మలవంబుల్ నిటలంబునం దుడిచి లెమ్మా, యింకనో ప్రేయసీ,
పలుకన్ లేవె యటంచుఁ గాంతుఁడననాపం కేజపత్త్రాక్షియున్;

క. ఘన విద్యుచ్ఛ_క్తిని సం
హాననంబున నూత్న సత్వ మలరునటుల మో
హాను హా స్తస్పర్శను గ
గ్గానలం గదలించి స్మృతి గనుంగొనె మెల్లన్; 15

తే. చాయఁ దొఱఁగిన ప్రత్యూషచంద్రిక యన
నర్ధహాసంబు మోమున సంకురింప
నరసె హృదయేశు వైశాఖ మంతరింప
మాధవుని గాంచు వనలక్ష్మిమాడ్కిఁ జెలియ; 16

తే. మెలఁత కన్నులు విప్పనిమేషమందె
పరమసంతోషలోక కవాటములును
గల్లు సడలెఁ గాంతునకుఁ, దాఁ గాల నడచు
నో తలనడచునో యదియుఁ దెలియండు; 17

ఉ. తామరపాకుదొప్ప వసుధాధర నిర్గత నిర్ఝరీజలం
బౌ మెకుఁ దెచ్చియిచ్చి చివురాకుల వీవన వీచు చంగనా
కోమల పాదపల్లవము గోమఱి గాయము వాఱియుంటఁ జిం
తామతి యై వనారిలుచుఁ దన్వికి నిట్లనెఁ బ్రేమ మొల్కఁగన్;

మ. పదము ల్గందఁగ దేహవల్లి కృశియింపన్ ముద్దునెమ్మోముసం
పద రేకెత్తఁగ, దుర్గమాటవులలోఁ బల్మాఱుఁ గా ల్మెట్టి డ

స్సి దిశల్ సూచుచు నేడ్చుచుం,దుదకుఁ గేకొట్టుచుం గుంజమం
దుదుటన్ శోకమునోడ మూర్ఛపడితే యో ప్రేయసీ,దీనవై;

తే. సూర్యుఁ డపరాద్రి భవనమ్ముఁ జొరకమున్నె
మృగయులనుగాంచి గృహమున కేఁగుదెంతు
నని వచించితిఁ గాని యీవనములందు
మార్గవిచ్యుతి రాత్రిఁ గ్రుమ్మరితిఁ దరుణి; 20

తే. కల శకుంత రవమ్ములు గడలుకొనెడు
ప్రత్యూషమ్మున వచ్చియుఁ బర్ణశాల
నిన్నుఁ గాంచక చింతించి యన్ని దెసలు
ననుదినంబును వెదకుచు నడలి బడలి; 21

ఉ. పారములేని పుణ్యపరిపాకవశమ్మున నిన్నుఁగంటి నీ
తీరునసైన నేఁడు పోలఁతీ, నినుఁ గాంచఁగఁబూర్వరూపశ్రీం
గారపు టస్థిపంజరముగాఁ గనుపట్టెద; వెంతలోపలన్
మాఱెను మంజులప్రకృతి మంచుచలిన్ జలజాతమట్టులన్; 22

చ. అనవుడు కాంత యిట్లనియె నబ్బురమే ప్రణయానుబంధవ
ర్ధనహృదయుల్ వియోగమునఁ గ్రాఁగుట;జక్కవపెంటి వెన్నెలం
దన ప్రియకాంతుఁగానక వ్యథాకరుణంబుగఁగూయుచున్ సరో
వనజలతాకుడుంగముల వందురుచుం జరియించు చుండదే?23

చ. నను నిట వీడిపోయి తని నమ్మి వనంబులు సొచ్చి చూచి నెం
దును నిను గానకే విసిగి తోరపు డప్పిని బావుటెంట నె
ట్టనఁ బడిపోవ, నంతనె నిటాలమునం జమ రంకురించి చ
ల్లని మలగాలిసోఁకి నొడలన్ గుటెత్తి వడంకితిం గడున్; 24

ఉ. కన్నులఁగట్టినా యిఁకను గాంతుఁ డటంచు నిరంతరంబు ని
న్నెన్నుచు మాలదైవమున కేడ్చుచు, లేవను శక్తిలేక యా
పన్నత నూర్చుచుఁ బడలి బాటలుసూచుచునుండమూర్ఛమైఁ
గన్నులు పచ్చనయ్యె; నెటుకాలముపోయెనొ గాన నవ్వలన్;

తే. మారుతానీతశబ్దంబు మాడ్కి నల్ల
శ్రవణపథమున నెద్దియో చలన మయ్యెఁ;
జంద్రికాశీతలంబైన స్పర్శ దేహ
మందు నూతనోజ్జీవన మలరఁ జేసె; 26

తే. కన్నుఱెప్పల నెత్తంగఁ గట్టయెదుటఁ
బ్రేమ సాక్షాత్కృతిగఁ గంటి బ్రియుని నిన్ను,
విరహశోషితచిత్తంబు వీక్షణామృ
తంపు సేచనమున నసార్ద్రంబు నాఁగ; 27

చ. అన విని కాంతుఁ డిట్లనియె నారట మొందితి నానిమిత్త మి
వ్వనులఁ జరించి డస్సి; తొలకపాటు నెఱుంగని ముద్దరాలి నా
వనజభవుండు కష్టములపాలొనరించెఁ; గురంగి కంట నీ
రు నిడిన వేటకానికి మరుల్లనియించునె, చింత పుట్టునే? 28

తే. పర్ణశాలకుఁ బోదము పద బిరాన,
జెప్పెద రహస్య మొక్కండు చెలియ నీకు;
నడువఁ జాలవు మెలమెల్ల నడుగు లిడుము
మద్భుజాలంబయష్టి నెమ్మదిగ నూని; 29

చ. చెలువయు నట్లకా కని విశీర్ణపువాతెఱ నాల్క నద్దుచుఁ
బలితపుమాంద్యముందొలఁగిపయ్యెదకొంగునుజక్కనొత్తిముం

గలఁ జరియించు కాంతు భుజకాండమెయూఁతగఁ, జెట్లనీడలన్
సలిలపుఁబట్టులన్ నిలిచి చల్లనిపయ్యెర కూరడిల్లుచున్ ; 30

చ. ఎఱలకుఁబోయి నీడముల కేఁగెడుపక్షులతోఁ బ్రదోషపుం
దరుణమునందు మందగమనంబునఁ బర్ణగృహంబుఁ జేరి య
త్తరుణియుఁ బ్రేయసుండు మునుదామటనొంపెనకష్టపుంబరం
పరఁ దలపోయుచుండఁ దెలవాఱెను దిక్కుల లక్షితంబుగన్ ;

క. తరుణార్కమయూఖంబుల
నిరువురుఁ జలి గ్రాఁగు చుండి, యిట్లనియెను సం
బరముగఁ గన్నియ ప్రియుఁడా,
పరమరహస్యం బదేదొ పలుకుము నాతోన్ ; 32

ఉ. నాపుడు కాంతుఁ డిట్లను, మనంబుఁ దిరంబొనరింపు, మంథకా
రావిల మైనరాత్రి నమృతాంశుని వెన్నెల నవ్వురీతి నీ
జీవితమున్ మనోజ్ఞముగఁ జేయు నుదంత మొకండు దెల్పెదన్
భావిశుభానుభూతులకుఁ బాత్రమవై దయివాఱునట్లుగన్ ;

మ. ధరణీఖండమునేలురాజునకు మోదంబార జన్మించి బం
గరు టుయ్యాలల నూఁగియున్ విభితిరస్కారంబునంగొండలన్
గొఱెల న్మేపుచు లోకవృత్తముల బాగు ల్గాంచకే ముగ్ధవై
తరుణీ, యుంటివిగాని నీ కుచితమే దాస్యంబు దారిద్ర్యమున్ ;

క. పరభూమీశునకు న్నిజ
ధరణీభాగంబు నోడి దారుణ శోక
స్ఫురితాత్ముం డయి నీక్కై
పురమును విడి వననివాసమును గొనెఁ బితయున్ ; 35

చ. అన విని తక్షణంబు మదియందు హఠా జ్జనితంబు లైన భా
వనలు పరస్పరాహతుల భ్రాంతము లౌచుఁ గలంగ లోక మ
వ్వనిత కగోచరాశయనిభంబు దురూహ్యము నై గనంబడం
దన హృదయేశుఁగాంచి చిఱునవ్వు మొగంబు నలంకరింపఁగన్;

మ. నను నచ్చోఁ గొనిపోవ నెంచి కడు విన్నాణంపుఁబన్నాగముం
గనుఁగొంటే, గిరులేడ రాజ్యములు బంగారంపు టుయ్యాలలే
డ? నిరాలంబమునీదువాక్యమనుచుండంగన్యయక్కాంతుఁ డి
ట్లనియెం బేరెదఁ జేయివెట్టికొని సత్యాలాపధుర్యంబుగన్ ;

తే. నన్నుఁ గపటాత్ముఁగా మది నెన్నకొంటె!
ప్రత్యయం బిప్పుడే నీకు బయలుపఱతు;
నాన్న దాచిన క్షాత్ర చిహ్నములు గొన్ని
వసుధగర్భంబునం ద్రుప్పు పట్టు ముగుద; 38

ఉ. అని కుటి కుడ్యపార్శ్వనిచితావని నచ్చెలి చూచుచుండఁ ద్ర
వ్విన శర చాప వర్మములు వెల్వడ నబ్బురమంది బాపురే!
జనకుఁడు గూఢచిత్తుఁడయి సంతతము న్వెత నోర్వుఁగాని యి
ట్లని వచియింపఁ డెద్దియును హా! తెలిసెంబిత దుఃఖహేతువుల్;

తే. అనుచుఁ గవచమ్ము శీర్షణ్య మస్త్రములను
బ్రీతిఁ గైకొని బాష్పము ల్విడిచి తడిపెఁ
దండ్రిఁ గాంచినయట్లు లా తన్వి హృదయ
మందు స్నేహానుబంధంబు క్రందుకొనఁగ; 40

తే. అతివ వచ్చెదవే యిప్పుడైన నీవు
జనకపాలిత మైన దేశమును గాంచ;

హర్మ్యము ల్శశిచంద్రోపలాంచితములు
పౌనరు నేఁటికి శిల్పనై పుణ్య మెసఁగ ;   4

చ. అనవుడు నూతనేచ్ఛమదియందుఁ జెలంగిన, స్వీయసౌధముఁ
గనఁ గుతుకమ్మునం జెలియ కాంతునితో నిటువల్కెఁ జిత్తమో
హన, గొనిపోయె దే యటకు, నమ్మ వసించిననా ప్రదేశముఁ
గనుఁగొన దుర్గమం బయినకాంక్షజనించె,నపూర్వమద్దియుఁ

చ. అనవిని ప్రేయసుండు నవునా, చను దెంతువె, నిశ్చయంబె,మీ
జనకుఁడు మున్ను నేలిన విశాలధరావలయంబు నేన పా
లన మొనరింతు, నీవును విలాసయుతంబుగ రాజ్యభోగవ
ర్ధన గృహిణీపదంబుఁ బ్రమదా, ముదమారనలంకరింపుమీ

క. కాంతా మూకీభావమె
కాంతుఁడు సమ్మతిగ నెంచెఁ, గాంతార గిరి
ప్రాంతంబులు విడి యిరువురు
చింతాశల్యంబుఁ బాసి చేరిరి పురికిన్;   4

మ. పురికిం బోయిన కొన్నిరోజులకు నాపూఁబోణి మెప్పించి బ
ధురసౌఖ్యోన్నతిఁ బెండ్లియాడె నతిసంతోషమ్మున న్వీరుఁడున్
ధరణీరాజ్యము భోగభాగ్యముల విద్యాకీర్తుల న్మిఱ ని
ర్భర సౌఖ్యమ్ముగ నేలుచుండెఁ బ్రజసంభావింపభక్తిస్ఫ్రహన్